# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఆంధ్ర మెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు, ఎంబ్రాయిడరీ ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది. పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము.

పారిశ్రామిక శిక్షణ కేంద్రము : 7-వ రోజరీ చర్చిరోడ్డులో ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక భవనములో వస్త్రములపై అద్దకపుపని, మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత, బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ మొదలగు పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుచున్నది.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు,—గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ

మహిళా మందిరము : స్త్రీ విద్యార్థినులకు వసతి గృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్ హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ—అడయారులో నిర్మించబడినది భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వ బడుచున్నది.

ముద్రణాలయము : ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపు రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యా వినోద కేంద్రం.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం.

## FORM IV
**[Rule 8]**

**(As Prescribed in the Registration of Newspapers (Central) Rules, 1959)**

*Statement about ownership and other particulars of* Andhra Mahila

| | |
|---|---|
| 1. Place of Publication | Mylapore, Madras. |
| 2. Periodicity of its publication | Monthly. |
| 3. Printer's Name<br>Nationality<br>Address | K. Lakshmi Raghuram,<br>Hindu,<br>Andhra Mahila Sabha, Mylapore Madras. |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | K. Lakshmi Raghuram,<br>Hindu,<br>Andhra Mahila Sabha, Mylapore, Madras. |
| 5. Editor's Name<br>Nationality<br>Address | K. Lakshmi Raghuram.<br>Hindu,<br>Andhra Mahila Sabha, Mylapore Madras. |
| 6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | " Andhra Mahila " journal is owned printed aud published by Andhra Mahila Sabha, which is a social service organisatiou, registered under Act XXI of 1860. No individual has any financial interest in the publication. |

I, K. Lakshmi Raghuram, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(K. Lakshmi Raghuram)

Date 28-3-1959

Signature of publisher

# ఆంధ్ర మహిళ

సంపుటి 15 :: మార్చి '59 :: సంచిక 3

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు :

కె. లక్ష్మీరఘురామ్.



సంయుక్త సంపాదకురాలు

రామలక్ష్మీఆరుద్ర.

## విషయసూచిక

ముఖచిత్రం :

మానవసేవను మించిన సేవలేదు. ధర్మంలేదు. ఈ రోగపీడిత మానవాళికి చేసేసేవేసేవ. అందుకే నర్సువృత్తి మాతృహృదయం కలస్త్రీల కెంతైనా తగినదని అందరూ అభిప్రాయ పడడం సత్యదూరం కాదు.



సంపుటి 15 :: మార్చి 59' :: సంచిక 3

# కుటుంబ నియంత్రణ

కుటుంబ నియంత్రణ వారి సమావేశం యీ మధ్య ఢిల్లీలో జరిగింది. కుటుంబ నియంత్రణ అనగా అది సాధించిన విజయాలకంటె అదెంతగా ప్రజానీకంలోకి ప్రాకిందా అన్న ప్రశ్న ఎద రౌతుంది.

దేశం మొత్తంమీద లెక్కలు కట్టేవారూ, మేధావులూ జనాభా పెరుగుదలని చూసి భయం చెందుతున్నారు. కాని వీధి మానసికి యింకా యీ కుటుంబ నియంత్రణ అంత ప్రముఖ విషయంగా తోచడంలేదు. ఇందువల్లే ప్రభుత్వం, సంక్షేమ సంస్థలు ఎంతగా యీ విషయాన్ని జనబాహుళ్యాని తెలియ చెప్పాలన్నా, అది విజయవంతం కావడంలేదు.

ఇటువంటి విషయాలు సాంఘిక సంస్కరణలను ఎంత ఉత్సాహం ఆవేశంతో తెగించి అమలులోకి తేడానికి పూర్వంలో పెద్దలు నడుములు బిగించారో—అలాగే తిరిగి ప్రారంభించాలి. అప్పుడ యితోధికంగా ప్రజానీకంలోకి యీ ఉద్దేశాలు ప్రాకి మార్పుకి దారి ఏర్పరుస్తాయి.

తగిన శిక్షణ పొందిన సిబ్బందిలేమి, ప్రజానీకంలో లైంగిక విషయాలపట్ల అనవసరపు మధ్య తలూ— యివన్నీకూడా కార్యకర్తల ఉత్సాహానికి నిరుత్సాహాన్ని జతచేస్తున్నాయి. శ్రీమతి రామారావు యీ విషయంపట్ల ఎంతో ఉత్సాహంతో పనిచేస్తున్నారు. రాబోయే పంచవర్ష ప్రణాళిక కాలంలో సుశిక్షితులైన సిబ్బంది తయారరైతే తప్పించి యిటువంటి ప్రణాళికలు విజయవంతం గావన్నారామె.

కుటుంబం పరిమితం చేసుకోవలసిన ఆవశ్యకత బాధ్యత దేశంలో ప్రతిఒక్కరికీ తెలియచెప్పాలి అదిఎలాగ? అన్నది తేల్చుకొంటే—పని సులభం అవుతుంది.

ప్రస్తుతం ఎన్నో ప్రచార కార్యక్రమాలు లేకపోలేదు. కాని వీటన్నిటిలో ఒక్కటేలోటు కన్పిస్తూంది. అదే ఏదో విధి నిర్వహిస్తున్నట్లు వచ్చిన వయోజన స్త్రీలకి విజ్ఞానశాస్త్ర పదజాలాలతో బోధన చేసేయడం. ఇలా కాకుండా, కుటుంబ నియంత్రణ, సంతాన నిరోధం స్త్రీలకి ముఖ్యంగా ఎంత అవసరమో తెలియజెప్పాలి. ఆర్థికంగా ; ఆరోగ్యవిషయ దృష్ట్యాకూడా కుటుంబాలను పరిమితం చేసుకోవడం అవసరం. ఇదరు ముగురు పిలలకు చేకూరిన సగుపాయాలు

కుటుంబ నియంత్రణ అనగానే భార్యాభర్తల అనుకూలతమీద ఆధారపడి వుంటుంది. కాని సర్వ సాధారణంగా యిటువంటి విషయాలపై భార్యకున్నంత శ్రద్ధ జాగ్రత్త భర్తకుండక పోవడంకూడ సహజం. అందుకే ముఖ్యంగా వీరు విముఖులుగా వుండడం- ఫామిలీప్లానింగు క్లినిక్కులు పరిశీలించిన వారి కందరికీ విశదమే. ఈ కార్యక్రమం నిజంగా కొనసాగాలంటే స్త్రీలతో సమానంగా పురుషులూ యీ విషయాలపట్ల ఆసక్తి కనపరచేలా చూడాలి.

జీవితం, ప్రకృతి మానవుడూ అందరూకలసి ఒక్కస్త్రీపట్లే నిర్లక్ష్యంగా ప్రవర్తించడం ముదావహం. ప్రకృతికి విరుద్ధంగా చేయలేం కనుక మానవ ప్రయత్నంలో లోటులేకుండా నిత్య జీవితంలో సహచరులైన వారికోసం పురుషుడూ కొంచెం ఓర్పు వహించాలి.

కుటుంబ నియంత్రణ; సంతాన నిరోధం- విషయాలు సంక్షేమ సంస్థలూ, స్వచ్ఛంద సేవకులూ అతి ప్రముఖ సమస్యలుగా గుర్తించి, వాటి ఆవశ్యకతని జనబాహుళ్యంలో నాటుకొనేలా చేయవలసిన బాధ్యత వీరిమీదనే వుంది. 



# రాజకీయాలు

### మద్రాసులో ప్రిన్స్ ఫిలిప్

జనవరి 31 నాడు ఎడింబరో, డ్యూక్ మద్రాసు వచ్చారు. కమెట్ 4 విమానం యిదే ప్రథమం మద్రాసు విమానాశ్రయంలో దిగటానికి. మద్రాసు ప్రజలు యీ రాజ వంశీకునికి ఘనస్వాగతం ఇచ్చారు.

డ్యూక్ ఆఫ్ ఎడింబరో, చూడటానికి అందగాడు, మృదుభాషి, చలోక్తికీ చమత్కారానికీ పేరు గాంచాడు. ఇంగ్లాండులో వీరిని ఆరాధించనివారులేరు. దేశపుటన్ని కార్యక్రమాలలోనూ అమిత ఉత్సాహాన్ని కనపరచే ప్రిన్స్ ఫిలిప్ ధైర్యసాహసాలు కలవాడు.

ఇంగ్లాండులో రాజుగారి భార్య సహజంగానే రాణీ అవుతుంది. కాని రాణీగారి భర్త రాజుకాడు. ఆతనికి యివ్వబడే గౌరవస్థానం, రాణీ యివ్వాలి. లేకుంటే హక్కు భుక్తంగా రాణిగారి భర్తకి ఉన్నతస్థానం రాదు.

రాజవంశాలలో సాధారణంగా ప్రేమించి వివాహాలు చేసుకోవడం అరుదు. వీరి జీవితం దేశం మొత్తంమీద ఐక్యమై వుండడం దీనికి కారణం. కాని నిజంగా అలాగే వివాహం జరిగితే ప్రజలు కూడా సంతృప్తి ప్రకటిస్తారు. రాణీ ఎలిజబెత్తు విషయంలో యిది నిజమైంది. రాకుమారి ఏనీ, రాకుమారుడు ఛార్లెసు యీ సుఖ సంసారానికి నిదర్శనలు. ఎంత ప్రత్యేక జీవితం గడుపుతున్న యీ రాజ కుటుంబం- అన్ని సామాన్య కుటుంబాలలాగా ఎంతో అనురాగ బంధితమైనది. ప్రిన్స్ ఫిలిప్ శీలం ఇందుకెంతగానో తోడ్పడుతుంది. అసలు బ్రిటిషు ప్రజ తమ రాజ కుటుంబాన్ని స్వంత బాధ్యతగా చూసుకుంటుంది. దాంతో రాజకుటుంబపు బాధ్యత మరింత హెచ్చుతుంది. ప్రజానీకానికంతకీ ఆదర్శప్రాయంగా వుంటూ, ఒక ఉదహరణగా రూపం దిద్దుకొంది ప్రిన్స్ ఫిలిప్ కుటుంబం. దేశానికి వీరు అధికారానికి చిహ్నాలే కాక, ఆచారాలకి, నడవడికీ కూడా చిహ్నాలు.

మన దేశంలో ఎడింబరో డ్యూకునను యిచ్చి స్వాగతం. వారియెడ మనకుగల ఆదరాభిమానాల ప్రత్యక్ష నిదర్శన. ఎంతో హృదయపూర్వకమైన ఆహ్వా న్ని అందుకున్నాడు ప్రిన్స్ ఫిలిప్; ఎలిజబెత్ రా వస్తే యీ ఆహ్వానం యింతకుమించి వుంటుందనట సత్య దూరం కాదు.

♦ ♦ ♦

కాంగ్రెసు అధ్యక్ష పదవికి శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక అయినారు. ఈమెలో నెహ్రూ కుటుంబంలో మూడవతరం- కాంగ్రెసు అధిష్ఠాన వర్గాన్ని అలంకరించడం. అసలు కాంగ్రెసు అధ్యక్షత వహించిన మొత్తం మహిళలలో శ్రీమతి గాంధీ నాల్గవ వ్యక్తి. తొలిసారిగా, 1917 కలకత్తా కాంగ్రెసు సభకు ఏనీబెసెంటు సతి అధ్యక్షత వహించింది. కాన్పూరు కాంగ్రెసును 1925లో శ్రీమతి సరోజినీ నాయుడు, 1933లో నళినీసేన్‌గుప్తా అధ్యక్షత వహించింది. శ్రీమతి గాంధీ యిప్పుడు ఎన్నిక కావడం ముదావహం. కాంగ్రెసు సంస్థ పటిష్ఠత చెడి అన్నివిధాలా వెనుకడుగు వేస్తున్నా యిటువంటి తరుణంలో, అభ్యుదయ భావాలుకలదీ, వయసులో చిన్నదీ, అన్ని రంగాలలోనూ యితోధికంగా సేవచేసినదీ అయిన శ్రీమతి యిందిర కాంగ్రెసు రథానికి సారథ్యం వహింప పూనుకోవడం అందరూ కోరుకోతగ్గది.

ఇందిరాగాంధీ దేశసేవా కార్యక్రమాలలో చిన్ననాటి నుండీ పాల్గొంటూనేవుంది. యిరవై సంవత్సరాలు కూడా రాకముందే అలహాబాదులో యువజన సంస్థను స్థాపించింది. 1942 విషమ కాలంలో కారాగారవాసం చేసింది. కాంగ్రెసు సంస్థతో యీమెకు పాతిక సంవత్సరాల సంబంధంవుంది. 1955 నుండీ కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యురాలుగానూ పని చేసింది.

సంఘసేవా రంగంలో శ్రీమతి గాంధీ చేసిన సేవల విలువ ఎన్నలేనిది. యీమె శిశు సంక్షేమ సంస్థ అధ్యక్ష



రాలు; కాంగ్రెసు మహిళా శాఖ సలహాదారు, బాల భవన్, బాల సహయోగ్ మొదలైనవాటి అధ్యక్షురాలు.

మన ప్రధాని కుడి భుజంగా వుంటూ యీమె తన యింట ప్రపంచంలోని ప్రధాన రాజకీయ వేత్తల సందరినీ వ్యక్తిగతంగా తెలుసుకొంది. కాంగ్రెసు పార్టీకి కావలసిన నూతన రక్తాన్ని ఉత్సాహాన్ని అందివ్వడానికి కావలసిన అన్ని హంగులూ కల్గిన మహిళ శ్రీమతి ఇందిరా గాంధీ.

జన్మతహ ఘనత వహించిన వ్యక్తి ఇందిర, నెహ్రూ కూతురు గానే గాక, వ్యక్తిగతంగా కూడా ఏ రంగంలోనైనా రాణించకల గుణ సంపన్నురాలు.

నవంబరు 10, లో అల్హాబాదులో పుట్టిన యీమె, కుటుంబాని కంతకీ ముద్దుబిడ్డ అయింది. చిన్ననాటి నుండీ కూడా వక్తిత్వంలో మెరిసే కళ్ళతో, ఒక విధంగా ప్రత్యేకత వహించి వుండేవి. తన మూడో సంవత్సరంలోనే నేషనల్ కాంగ్రెస్ మహాసభలకు హాజరయింది. పన్నెండో ఏట పిల్లల సంఘాన్నొక దాన్ని స్థాపించి దానికి "కోతులసేన" అన్న పేరు సంపాదించి పెట్టింది, ఈ సైనికుల పని— రాజకీయ నాయకుల ఊహలని వార్తలని సేనలకి అందచెయ్యడం।

కుటుంబ వాతావరణాన్ని అనుసరించి రాజకీయ రంగంలోనే దిగినా ఇందిరా గాంధీ తొలి ప్రేమసంఘసేవ. విశ్వ భారతి, స్విజర్‌లాండ్ ఆక్సఫర్డులలో విద్యాభ్యాసం చేసిన యీమె దృక్పథం అతివైశాల్యం. విదేశాల నుంచి రాగానే, ఖద్దరు అమ్మకంలోనూ, స్వదేశానినాదం వ్యాపింప చేయడంలోనూ, చిన్న చిన్న హరిజన వాడలలో పని చేసేది. నేషనల్ కాంగ్రెసులో 1927 లో సభ్యురాలుగా చేరింది. తరువాత పదమూడు నెలల కారాగారవాసం చేసింది. ఆక్సఫర్డులో చదువుకొనే రోజులలో పరిచయం ఏర్పడిన ఒక పార్సీ విద్యార్థి ఫిరోజ్ గాంధీని తరువాత వివాహం చేసుకుంది.

తండ్రితో కలిసి విదేశ పర్యటనలు చాలా చేసింది, 1939 లో తల్లి కమలా నెహ్రూ కను మూసింది. 1946 లో యిందిర తండ్రికి అండ దండాలుగా నిలవడానికి తండ్రి యింటికి వచ్చింది. ఇక్కడ నెహ్రూ యింటి దీపంగా, అతనికి ప్రతి క్షణం సహచరిగా వుంటూంది ఇందిర. చలాకీ అయిన యీమె వుండడం, తండ్రికి కొంత ఉత్సాహాన్ని యిచ్చింది. శ్రీమతి గాంధీ యిద్దరు పిల్లల తల్లి, తన తండ్రికోసం కుటుంబ సౌఖ్యాన్ని లెక్క చేయక, సాహసించిన వ్యక్తి యీమె. ఈరోజు, ఫిరోజ్ గాంధీ (పార్లమెంటు సభ్యుడు) విడిగా నివసిస్తున్నాడు. సెప్టెంబరు 1955 లో కాంగ్రెసు ఎలెక్షన్ కమిటీకి సభ్యురాలుగా ఎన్నిక అయింది.

ఇందిర నిరాడంబర వ్యక్తి- సాధారణంగా ఏ నగలూ ధరించదు. తరచు చేతితో కుట్టిన తెల్ల చీరలు ధరిస్తూ వుంటుంది. ఘనకీర్తి వహించిన తండ్రి చాటున పెరిగిన యిందిరా గాంధీ తన వక్తిత్వాన్ని పోకొట్టుకోలేదు సరికదా, యినుమడింప చేసుకుంది.

♦ ♦ ♦

జాతీయ ప్రణాళికల నిర్వహణలో రాజకీయ విభేదాలను మరిచిపోయి, అన్ని పార్టీలూ సహకరించాలని ప్రధాని నెహ్రూ రాజ్య సభలో విజ్ఞప్తిచేశారు. ఆహార ధాన్యాలలో టోకు వ్యాపారం రానున్న సంస్కరణలకు ప్రారంభం మాత్రమే అని అన్నారు.

దేశాభ్యుదయ సాధనకు ప్రణాళికలను నిర్వహించడంలో అటు ప్రజ యిటు ప్రభుత్వం, ప్రభుత్వ వ్యతిరేక పార్టీలూ అన్నీ సహకరించాలని అన్నారు. తృతీయ పంచవర్షప్రణాళిక విజయవంతం చేయడం మన విధి. తద్వారా, బడుగు దేశంగా వున్న మనం, ఆర్థిక స్వశక్తిని పొందుతాం, స్వయం పోషక మవడానికి సమైక్య కృషి, సహకారం ఎంతో అవసరం.

రెండు సంవత్సరాలు వరిపంట వరసగా దెబ్బతింది. దానితో ధాన్యం కొంచెం కొరతవడినా విషయ పరిస్థితి ఏర్పడలేదు. యీ సంవత్సరం పంటలు బాగానే పండాయి. దేశం మొత్తంమీద ఆహార సమస్య ఒక విధంగా కొలికికి వస్తుంది.

ప్రజానీకపు అవసరాలను గుర్తించి వ్యాపారస్తులు అన్యాయంగా ధరలు విపరీతంగా పెంచకుండా వుండాలి- ప్రస్తుతం యీ ప్రాంతాలలో ఆహార ధాన్యాల ధరలు విప రీతంగా వున్నాయి. దీనితో చిల్లర సంసారులు, మధ్య తరగతి వారు ఎక్కువ యిబ్బందుల పాలవుతున్నారు. వ్యాపారస్తులు తమ లాభ నష్టాల లెక్కలతో తృప్తిపడక జన బాహుళ్యపు అవసరాలని గుర్తించే ఉదారులు కావాలి. ప్రభుత్వపరంగా ధాన్య వ్యాపారం మొదలుపెట్టితే తప్ప ధరలను అదుపులో పెట్టడానికి వేరే యింకో మార్గం లేకుండా చెయ్యడం వ్యాపారులకి తగిన పని కాదు.

♦ ♦ ♦

వచ్చే రెండు సంవత్సరాలలోనూ ఇండియాకు డెబ్బయి కోట్ల డాలర్ల విదేశీకరెన్సీ లభ్యమయే సూచ నలు కానవస్తున్నాయి. ఇటువంటి సహాయం కోరుతూ యిండియా చేసిన విజ్ఞప్తికి అమెరికా మున్నగు దేశాలు క్రమ ఘట్టాలలో యిటువంటి సహాయం చేయవచ్చునని తోస్తుంది.

ఈ అవసరాన్ని గుర్తించి, తీర్చడానికి మార్గాలు అన్వేషించడానికి గాను, మన దేశానికి మదిపు పెడుతూన్న ముఖ్యమైన దేశాలు అమెరికా, కెనడా, జపాన్, బ్రిటన్, వెస్టు జర్మనీ వచ్చే నెలలో ప్రపంచబ్యాంకి ఆధ్వర్యాన సమావేశమై చర్చలు సాగిస్తాయి

ప్రస్తుతం పరిస్థితుల దృష్ట్యా ఏప్రిల్ మాసంలో ఎన్నికలు సంభవం కావని తన మంత్రివర్గం రాజీనామా ఇచ్చి నట్లు ప్రెసిడెంటునకు తెలియజేశానని, జనరల్ నెవిన్ బర్మా పార్లమెంటులో నేడు తెలియజేశాడు. ఇదివరలో బర్మాలో యుద్ధతంత్ర కార్యక్రమాల అధ్యక్షుడుగానున్న నెవిన్, గత అక్టోబరులో ప్రధాని ఉను రాజీనామా ఇవ్వ గానే ఆపదవికి ఎన్నుకోబడ్డాడు.

ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఫాసిస్టు వ్యతిరేక ప్రజా మండలివారు యింకో ఆరుమాసాలపాటు నెవిన్ ప్రధాని వుండేలా ప్రయత్నాలు చేయవచ్చునని అనుకుంటున్నారు.

దేశంలో సామరస్యం సమైక్యత తీసుకురావాలని ప్రయత్నిస్తుంటే, కొన్ని జాతులవారికి ప్రత్యేక రాష్ట్రాలు కావాలనడం, న్యాయంకాదనీ, నాయకులూ ప్రజలూ దేశ ఐక్యతకోసం పాటు పడాలనీ జనరల్ నేవిన్ కోరారు. జనరల్ ఎన్నికలు జరిపించడానికి గల అవకాశాలను గురించి పార్లమెంటుకు వివరించిన పిదప జనరల్ నెవిన్ తన అధికారాలని అదే సభకు అప్పచెప్పవచ్చు నని భావిస్తున్నారు.

♦ ♦ ♦

కాంగ్రెసునుండి విడిపోయిన చెన్నారెడ్డి ప్రభృతులు స్థాపించిన డిమొక్రెటిక్ పార్టీకి శ్రీ గౌతు లచ్చన్నగారు. అధ్యక్షుడుగా ఎన్నికైనారు. వారి నాయకుడు శ్రీ యం. చెన్నారెడ్డి.

ఈ కొత్త పార్టీ ఆంధ్ర శాసన సభలో ప్రధాన ప్రతి పక్షంగా వ్యవహరించకలదని అనుకుంటున్నారు.

—రుద్రాణి

# కృతజ్ఞత

శ్రీమతి నహాట ధనలక్ష్మి సుందర్‌లాల్. వీరు రు॥ 500/- విరాళము యిచ్చి, మన సభకు పోషకులుగా అయినందులకు మా కృతజ్ఞత తెలియజేయుచున్నాము.

శ్రీమతి ధరణిప్రగడ శేషాయమ్మగారు మన సభకు వందరూపాయలు యిచ్చి యావ జ్జీవ సభ్యులైనందులకు మాకృతజ్ఞత తెలియజేయుచున్నాము.

శ్రీమాన్ పి. నరసింహంగారు- సభయొక్క లైబ్రెరీకి 56 విలువగల పుస్తకములు యిచ్చిరి.

శ్రీమాన్ సి. శ్రీనివాసన్‌గారు, 3 పుస్తకములు యిచ్చిరి. వీరిద్దరికి కూడ మా కృత జ్ఞత తెలియజేయుచున్నాము.

ఒక అవసరానికి

# పొదుపు

చేయండి




ఇలాగ ఏదో ఒక అవసరానికిగాను ప్రభుత్వం ప్రవేశపెట్టిన

## క్రొత్త
## 'గడువు డిపాజిటు పొదుపు పథకం'లో

ప్రతి నెలా మీ పొదుపు ధనాన్ని మదుపు పెట్టండి.



| | |
|---|---|
| నెలసరి డిపాజిట్లు | ప్రతి నెలా రు 5 నుండి రు 200 వరకు |
| నెలసరి రు 10 ల డిపాజిట్లపై లభించేది | అయిదేళ్ల తర్వాత రు 650; పదేళ్ల తర్వాత రు 1,450 లు లభిస్తాయి. |
| డిపాజిటు పరిమితి | ఒక్కరు రు 12,000 లు, ఇద్దరు వ్యక్తులు కలిసి అయితే రు 24,000ల వరకు డిపాజిటు చేయవచ్చును. |

పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు వారు గాని



## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

... ఈ పెట్టుబడుల విషయమై పూర్తి వివరాలు మీకు సంతోషంతో అందజేస్తారు.




## బుద్ధిశ్చిత్తవికారిణీ —

అంటే ధనము సంవృద్ధిగానున్న మనస్సును వికారము నొందించును.

అయితే అవుగాక, ధనములేని మనిషి పూచిక పుల్లకు చెల్లడు - ధనములోవుంది అంతా. అందుకనే ధనం మిదంజగతని పదే పదే మనకు చెప్తూవుంటారు. ధనము లేనిది సుఖములేదు. గౌరవములేదు - కీర్తి లేదు — శాంతిలేదు - అందుకనే ఎన్నిపాట్లయినా పడి డబ్బు సంపాదించాలి - పొట్ట కూటికి కోటి విద్యలు - అంటే కేవలము ఒక పావుశేరు బియ్యము గిద్దెడు పప్పు సరిపోదు. జీవితానికి కావలసిన సరం జామా అంతా కావాలి. తిన్న తరువాత తాగాలి. త్రాగిన తరువాత భుక్తాయాసముతో బాధపడకుండా పడుకోవాలి. పడుకోటానికి హంసతూలికా తల్పము లేకపోయినా ఒక రాతిపాన్పయినా కావాలి. నిద్ర లేచిన తరువాత సేద దీర్చుకోటానికి ఆహారము, ఆనందానికి వినోదము, ఆహ్లాదానికి క్రీడ అవసరము. ఈ కార్యక్రమమంతా జరిపించటానికి గృహమనే ఒక స్థానము, కార్యక్రమము నిర్విఘ్నముగా జరిపించటానికి భార్యా బిడ్డలు, జరిపించటానికి సూత్రదారుడు భర్త అవసరము — అందుచేతసుఖంగా జీవితము గడపాలంటే గృహస్థుగా వుండటము చాలా అవసరము. ఆ పితలాటముతోపాటు డబ్బు ఇంకా అవసరము. డబ్బు అవసరము అంతింతని నేను వేరుగా చెప్పనవసరములేదు. ప్రతినిత్యము మన మందరము దాని అవసరము తెలుసుకుంటూనే వున్నాము.

అయితే, ఈ అత్యవసరమైన ధనము ఎట్లావస్తుంది? తాతలు దండ్రులు తినకుండా అనుభవించకుండా మూటకట్టన్నా ఇవ్వాలి. కష్టపడి సంపాదించనన్నా సంపాదించాలి, లేదే ఏ లాటరీలోనన్నా కలసివచ్చి రావాలి. ఏదో వ్యాపారమన్నా చేయాలి, లేదా ఎవరికైనా మసి బూసి మారేడికాయచేసి బిస్మిల్లా చేయాలి (పొలముదున్నె కర్షకుడికి మాత్రము తిండే గాని డబ్బు దొరకదు సుమండీ!) పైవిధములలో ఏ విధముగా ధనము లభించినా వారు అదృష్టవంతులే. అది లేనివారిని దురదృష్టవంతులంటారు. అంతేకాదు ధనమున్నవారు అదృష్టవంతులే కాకుండా వారు భాగ్యవంతులుగా, పుణ్యాత్ములుగా పరిగణింపబడు చున్నారు -

అదుగో అక్కడే వస్తుంది చిక్కు. ఏ భాగ్య వంతుడినైనా అడగండి మీకు సందేహముంటే. వాళ్ళ కష్టాలన్నీ వివరంగాచెప్పినా చెప్పకపోయినా "అంత చెట్టుకు అంత గాలి" అని అనటముతో మనలాంటి వాళ్ళు వాళ్ళకు దూరముగా వుండాల్సివస్తుంది. అందుకనే ధనికవర్గము, బీదలు, మధ్యరకమువర్గాలు అనేకులాలు పుట్టినవి. ఈ కులాలుకూడా మన దేశ

ములో కులభేధాలలోవున్న విభేధాలు, వైషమ్యాలూ వున్నవి. ఈ రోగము ప్రప్రథమంగా అమెరికాలో బయలుదేరి క్రమక్రమంగా అన్ని దేశాలు అలుముకున్నది ఇప్పుడిప్పుడే మన దేశములోను అలుముకో బూనుతూవుంటే రాజకీయ పార్టీల పుణ్యమాంటూ వెనకడుగువేసింది. మరి ఆరోగాన్ని పూర్తిగా నిర్మూలించటము మానవులకు తరమూ ? మందులతో నయమయే రోగముకాదు. ఏమో స్పుత్నిక్ రోజులలో, ఏదైనా సాధ్యము కావచ్చు.

అయితే ఈ ధనికవర్గము సంగతి ఆలోచించుదాము. "సర్వజనాః కాంచన మాత్రయింతి" అన్నారు. అంటే అందరూ ధనమును ఆశించుతారు. అది నిజమే. కాని వారు నిజంగా పుణ్యాత్ములేనా ? వారు పూర్వజన్మలో పుణ్యము చేసుకుంటే నేనా ధనవంతులై పుట్టినది. కాదు ఎంతమాత్రము కాదు.

ఏదో పాపము చేసుకున్నవారే ఆ గర్భశ్రీమంతులై పుట్టుతారు — లేదా ఆపళంగా లక్ష్మి వచ్చి ఇంట కూర్చుంటుంది. ఎందుకయా అంటే మానవునికి డబ్బిచ్చి, తద్వారా ఐహిక సుఖములనిచ్చి భగవంతుడు వారిని పరీక్షచేస్తాడు. కాంచనమువలన కర్మము వదలును. ఆ డబ్బుతో ఋణశేషము తీర్చుకునే అవకాశము కలుగచేస్తాడు. పాపము పుణ్యము రెండూ అవలీలగా చేయగల అవకాశములు కలుగచేస్తాడు — ధర్మ కామ మోక్షములు సాధించటానికి అవకాశము పూర్తిగా కలుగచేస్తాడు. ఈ విషయము ఇటు మన పురాణాలలోను అటు బైబిలులోకూడా చెప్పియున్నది. ఉమారుఖయ్యాంలోను ఈ విషయము విపులంగా విశదీకరించారు. కాబట్టి ధనవంతుడు బీదవానికన్నా ఎక్కువ జాగ్రత్తగా జీవితములో మసలుకోవాలి. తను చేస్తున్న స్నేహము, తను చేస్తున్న ధర్మము, తన అతిథులు తగినవారా కాదా యని బాగుగ ఆలోచించు కొనవలయును. తను చేస్తున్న ప్రతి చేతా ముందు వెనుకలు ఆలోచించిగాని చేయరాదు. ధనవంతుడు బాగుపడేదానికన్నా చెడిపోయే అవకాశాలు ఎక్కువున్నవి. చుట్టూ భట్రాజులు చేరే అవకాశమున్నది సప్తవ్యసనాలకి చల్లగా చేరే అవకాశమున్నది. ధనము పాపకార్యముల కుపయోగించే ప్రమాదమున్నది. డబ్బు వుంటే చాలు అందరూ ఖర్చు చేయగలరు - దానిని సక్రమంగా ఖర్చు చేయడము ఎవరికో ఒక పుణ్యాత్మునికి దప్ప తెలియదు- డబ్బు సంపాదించుకోవచ్చు - దానిలోని ఘనతలేదు. ఎవరు ఏవిధంగా డబ్బు ఖర్చుచేస్తారో ఆ విధంగానే వారి పుణ్యము వారి ఖర్మలు నిర్ణయింపబడుతవి.

సత్కార్యములవల్ల, సత్కర్మలవల్ల ధనవంతుడు పుణ్యము సంపాదించవచ్చును. అతనికి అదృష్టవశాత్తు ఆ పుణ్యము సంపాదించుకునే అవకాశము దైవము లభింపచేశాడు. కాని పరమాత్ముని లీలలు కడు చిత్రము - పుణ్యము చేసుకోటానికివున్న అవకాశములకన్న అధోగతిపాలయే ప్రమాదము ఎక్కువగా వుండును ఏ ఒక తప్పడడుగువేసినా ఆ జీవికి అధోగతి పాలుతప్పదు - ఆ వ్యక్తి ధనము ఒక శాపము -

కాబట్టి ధనములేక లేమిచే కష్టపడేవారికి ఒక తృప్తి వుండకతప్పదు. వారికి సుఖములేకపోవచ్చును- పుణ్యము లేకపోవచ్చును. దానితోపాటే పాపము వుండదు. ధనవంతునికన్నా పుణ్యము ఎక్కువ చేసుకునే అవకాశమున్నది కాబట్టి భాగ్యము మానవుల పరీక్షార్థము దైవము సృష్టించిన పరిణామముగా గ్రహించాలి గాని అదే పుణ్యంగా పరిగణించటము పొరపాటు.

ధనవంతుడై పాపముల జోలికి పోకుండా పుణ్యము చేసుకున్నవాడు ధన్యుడు, ద్విధన్యుడు (double blessed) కూడాను.



# శ్రీమతి సరోజినీనాయుడు

(1879-1949)

డాక్టరు సరోజిని నాయుడు 1879 ఫిబ్రవరి పదమూడవ తేదీన జన్మించింది. ఈమె తల్లి నుండి మానవదయార్ద్రతనీ, కవితాత్మక హృదయాన్ని ; తండ్రి వద్దనుండి ప్రజాసేవ ఇంకా ఇంకా తెలుసుకోవాలనే తృష్ణనూ పుణికిపుచ్చుకుంది.

దారిద్ర్యం, మూర్ఖత, కులభేదాలు, సాంఘిక దుస్థితులు దేశంపై వాని చెడ్డప్రభావం బాల్యంనుండీ తెలుసుకొని బాధపడుతుండేది. పెద్దయిన తర్వాత వాని నెదుర్కొనడానికి నడుము కట్టినది.

ఈమె తన మతమునకుగాని కులమునకుగాని చెందని డాక్టరు ఎమ్. గోవిందరాజులు నాయుడుని పెండ్లాడడమే, బూజుపట్టిన హిందూధర్మాలను మొట్టమొనటిసారిగా ఎదురుకొనడం. హిందూ సంఘాన్ని ఉంటరిగా చేసివేసిన కులమతభేదాల్ని ఈ విధంగా ఛేదించి ముందడుగు వేసింది.

శ్రీమతి సరోజిని మతమునకు ఎటువంటి ప్రత్యేక గౌరవమును ఈయలేదు. ఈమె హిందూ ముస్లిములను వేర్వేరుగా చూడలేదు. ఈ సౌజన్య భావానికి కారణం ఆమె ముస్లిమ్ ప్రదేశమైన హైదరాబాదున పెరగటమే ఐయుండవచ్చు. ఈమె హిందూ ముస్లిమ్ ఐక్యతకొరకు జీవితాంతం పాటుపడింది. హిందూ ముస్లిమ్ సమావేశాలలోని ఆమె వుపన్యాసాలు ముస్లిముల పట్ల ఆమెకున్న సహృదతయను, ఓర్పును చాటుతాయి. కులమత సమైక్యతా విషయాలలో ఈమెపై గాంధీజీకి పరిపూర్ణ విశ్వాసముండేది. "ఇండియా ఐక్యతను నీకు అప్పజెప్పుతున్నాను" అని ఆయన 1922 లో జైలు వెళ్ళుతూన్నప్పుడు ఆమెతో అన్నారు.

సరోజినీదేవి సంఘసేవా తత్పరత బహుముఖమైనది. హిందూ స్త్రీల హక్కుల పోరాటంలో ఈమె ఒక ముఖ్య సైనికురాలు. స్త్రీల సంక్షేమంలో ఈమె ఆసక్తివారి అనేక అవసరాలపై కేంద్రీకరించబడింది. బాల్య వివాహాల వ్యతిరేకి యీామె.

1919 లో స్త్రీలకు వోటింగు హక్కుకోసం అప్పుడు ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా నున్న ఇ. ఎస్. మాంటేగ్ వద్దకు ఒక డెలిగేషనును తీసుకొని వెళ్ళింది. జెనీవా ఇంటర్నేషనల్ కాన్ఫరెన్సునకు ఇండియా ప్రతినిధిగా యీామె 1920 వ సంవత్సరములో వెళ్ళినది. 1930 వ సంవత్సరం అఖిలభారత స్త్రీల సమావేశానికి అధ్యక్షత వహించింది. 1931 లో లండనులో జరిగిన రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకు హిందూ స్త్రీల ప్రతినిధిగా వెళ్ళింది.

భారత స్వాతంత్ర్యసిద్ధి తర్వాత ఈమె యు. పి.కి గవర్నర్‌గా నియమింపబడినది. ఈమెయే ప్రప్రథమ స్త్రీ గవర్నర్. ఈమె 1949 వ సంవత్సరం మార్చి రెండవ తేదీన స్వర్గస్థురాలైనది.



కథానిక

# తొలకరి స్వర్గం

కుమారి డి. వాణి

'అక్కా! ప్రసాద్ బావ అమెరికానించి వచ్చేశాడుట'. అంటూ మధు పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తున్న శారదవద్దకు పరుగెత్తాడు.

'నిజంగానా మధూ!' అన్నది అప్రయత్నంగా సిగ్గు దొంతరల నణచుకుంటూ.

'నే నబద్ధమాడతానా అక్కా? అంత నమ్మకం లేకపోతే అత్తయ్య వ్రాసిన ఉత్తరం చూడు', అని ఇచ్చాడు. శారద ఆనందభరితురాలైంది. మదిలో మధురభావనలు రేకెత్తగా నీళ్ళుపోయడం మర్చిపోయి జాజిపందిరి నానుకొని నిల్చుండిపోయింది.

◆ ◆ ◆

జోగయ్య సామాన్య సంసారి. అతనికి శారద, మధు యిద్దరు పిల్లలు. శారద అతిసుందరంగా మలచిన దంతపు బొమ్మవలెనుంటుంది. మధురంగా పాడుతుంది. గుణవంతురాలు

శేషమ్మ జోగయ్య చెల్లెలు. ఆమె భర్త పేరు పొందిన న్యాయవాది. వారి అబ్బాయి ప్రసాద్. లోక లాంఛన ప్రకారంగా చిన్నప్పటినించి శారద 'ప్రసాద్ భార్య'గా వ్యవహరింపబడింది.

శారద థర్డుఫారం ప్యాసైంది. జోగయ్య యిక చదివించనన్నాడు. కాని ప్రసాద్ ఆమెను స్కూలు ఫైనలువరకు చదివించమని పట్టుబట్టాడు. ఆమె భవిష్యత్తును అతని చేతుల్లో పెట్టదలచుకున్న జోగయ్య అతని కోర్కెను కాదనలేకపోయాడు.

ప్రసాద్ యం.యస్.సి. ఫస్టుగా ప్యాసై రిసెర్చికి అమెరికా వెళ్ళే ఛాన్సు సంపాదించాడు. అప్పటికి శారద స్కూలుఫైనలు ముగించింది. ప్రసాద్ ప్రయాణం సంగతి తెలిసి వివాహం జరిపేస్తే బాగుంటుందని జోగయ్య చెల్లెలికీ, బావమరిదికీ వ్రాశాడు. కాని ప్రసాద్ చదువు పూర్తవాలన్నాడు. అందుచేత శాస్త్రోక్తంగా నిశ్చయతాంబూలాలు మాత్రం పుచ్చుకున్నారు.

ప్రసాద్ అమెరికా వెళ్ళేముందు మేనమామగారింటికి వచ్చాడు. శారద, మధుతో నాలుగురోజులు హాయిగా గడిచాయి.

ఆ రోజు సాయంత్రం శారద పువ్వులు కోస్తూంది.

'నన్ను మర్చిపోతావా శారదా?' అంటూ ప్రసాద్ ఆమెకెదురుగా నించున్నాడు.

'అది నేను అడగవలసిన ప్రశ్న బావా! అమెరికా నించి వచ్చేక గ్రాడ్యుయేటునే చేసుకుంటానంటావేమో!' అన్నది దిగులుగా నవ్వుతూ.

'సంసారం సుఖప్రదం కావడానికి, పెద్ద చదువులకు సంబంధంలేదు శారదా! నా సర్వస్వమైన నిన్ను నేనెన్నడూ దూరం చేసుకోను', అని ప్రేమతో ఆమె చేతులు స్పృశించాడు.

మరునాడు శారద బరువెక్కిన హృదయంతో నవ్వుతూ ప్రసాద్‌ను సాగనంపింది.

◆ ◆ ◆

ఆ విదేశీయ వాతావరణం ప్రసాద్‌కు కొన్నాళ్ళు వింతగా తోచింది. స్త్రీలు, పురుషులు చాలచనువుగా మసలడం, ఆ నాగరికత అతనికొకవిధమైన ఆనందాన్ని కలిగించాయి. ఆ యువక హృదయంలో ఉత్సాహం వెల్లువలై పారగా వారిలో ఒకడైపోయాడు. చదువు, పొజిషన్ అతనిలో అహంభావాన్ని రేపాయి. ఆ జీవితం అతని ఆత్మీయులను మరపించింది. ప్రసాద్ అమెరికాలో ఉండగానే తండ్రి మరణించాడు. శేషమ్మ వ్యవహారాలు చూసుకుంటూ మద్రాసులోనే ఉండిపోయింది.

రిసెర్చి పూర్తి అయిన తరువాత డాక్టరేట్ పొందిన ప్రసాద్ తిరిగిరావడానికి మనస్ఫూర్తిగా యిష్ట

పడలేకపోయాడు. కాని తల్లి ఆవేదన, పట్టుదల అతన్ని స్వదేశానికి రప్పించాయి.

♦ ♦ ♦

'మాఘ మాసం యిక నెలరోజులే ఉంది. పెళ్ళి ముహూర్తం పెట్టమని మామయ్యకు వ్రాస్తాను ప్రసాద్ !' అన్నది శేషమ్మ.

'పెళ్ళి ముహూర్తం దేనికమ్మా ?' అతని కంఠంలో ఆశ్చర్యం తొణికిసలాడింది.

'పరిహాసంగా ఉందా ప్రసాద్ ? మామయ్య కూతురు శారదను నీకిద్దామనుకోవడం మర్చిపోయావా ?' అని అడిగింది.

'నేను శారదను చేసుకోవడం అసంభవం !' అన్నాడు. శేషమ్మ తెల్లబోయింది.

'శారద బంగారు బొమ్మ. గుణవంతురాలు. నువ్వు శారదనెంతో ఆప్యాయంగా చూచేవాడివి, ఇప్పుడీవిధంగా మాట్లాడుతున్నావేం ప్రసాద్ ?'

'అవన్నీ చిన్ననాటి మాటలమ్మా ! నా చదువుకి, హోదాకి స్కూలుఫైనలు మాత్రమే ప్యాసయిన పల్లెటూరి శారద యెంతమాత్రం తగదు. మామయ్య స్థితిగతులు మనతో యే మాత్రం సరితూగవు. చిన్నప్పటి అజ్ఞానపు చేష్టలు చూచి 'ప్రేమ' అని భ్రమించడం తెలివి తక్కువ', అన్నాడు.

'మామయ్య నాకోసమే ఆస్తినంతటిని ఖర్చు పెట్టాడు. ఆ డబ్బుతోనే యీ స్థితికి వచ్చిన మనం మామయ్యను చులకనచేయడం తగనిపని. శారద నీ కోసం వేయికళ్ళతో యెదురు చూస్తూంది. ఈమాట వింటే వాళ్ళెంత బాధపడతారు! డబ్బుతో ప్రేమానురాగాలు వీడటంలో మానవత్వంలేదు. ప్రేమమూర్తి శారద హృదయాన్ని భగ్నంచేయడం అమానుషం ! విదేశీయ వాతావరణం నిన్ను మాకు దూరం చేస్తుందనుకోలేదు. మనస్సాక్షికి వ్యతిరేకంగా నడచుకుంటే నీకు అపజయమే యెదురవుతుంది ప్రసాద్ !' శేషమ్మ కంఠం గద్గదమైంది.

'నీ కృతజ్ఞత డబ్బు సహాయం చేయడంలో వెల్లడించుకో అమ్మా ! కాని నాకుమెడకు శారదను బలవంతంగా కట్టాలని ప్రయత్నించకు', అని విసురుగా వెళ్ళిపోయాడు. డబ్బుకోసం తండ్రి పైసంబంధాలు చూచినప్పుడు శారదనేకాని చేసుకోనన్న ప్రసాదేనా! అని శేషమ్మ నివ్వెరపోయింది.

♦ ♦ ♦

శేషమ్మ వ్రాసిన ఉత్తరం చూచి జోగయ్య చాల బాధపడ్డాడు. తామెంత బీదవారైనా శారద అదృష్టవంతురాలని ఉప్పొంగిన మధురక్షణాలు అతని స్మృతిపథంలో మెరిశాయి. శారద దీనవదనంచూచే సరికి కళ్ళంట నీళ్ళు తిరిగాయి. లోకపు హేళనలను లక్ష్యపెట్టక దీర్ఘమైన అయిదు సంవత్సరాలు ప్రసాద్ రాకకోసం నిరీక్షించిన ఫలితం యింత నిరాశాపూరితంగా ఉన్నందుకు ఆవేదనతో క్రుంగిపోయాడు.

బావ ! తన సర్వస్వం అనుకున్నబావ ! 'శారద ! శారద !' అని కూడ తిరిగి తన జీవితంలో ఆనందాన్ని పరుగులెత్తించిన బావ తనను నిరాకరించాడని తెలిసి శారద మ్రాన్పడిపోయింది.

'నా సర్వస్వమైన నిన్నెప్పుడూ దూరం చేసుకోను శారదా !' ప్రసాద్ ప్రేమపూరితమైన పలుకులు చెవుల్లో మారుమ్రోగాయి. అంతగా ప్రేమించిన బావ తనను నిరాకరించాక తనెవరికోసం బ్రతకాలి ? డబ్బుని, గ్లామర్‌ని చూచి మోజుపడే బావ యేనాటికైనా న్యాయం గుర్తించకపోడు !

జోగయ్య శారదకు పైసంబంధాలు చూడసాగాడు. తను ఆత్మహత్య చేసుకోవడం తల్లిదండ్రులకు బాధాకరమని ఆలోచించే శారద బ్రతుకును భారంగా నెట్టసాగింది.

♦ ♦ ♦

ప్రసాద్‌కు బొంబాయిలో ఉద్యోగమైంది. శేషమ్మను కూడ తీసుకొని వెళ్ళిపోయాడు.

ప్రసాద్‌కు ప్రక్క యింటి సింధీ యువతి నీలతో పరిచయమైంది. బి.ఎ. చదివే నీల ఒక ఆఫీసరు కూతురు. చలాకీగా, ఫ్యాషనబుల్‌గా ఉండేది. ఆడంబరాన్ని ప్రేమించే ప్రసాద్ ఆమెకు దాసుడైనాడు. ఇద్దరూ స్వేచ్ఛగా తిరిగేవారు. ప్రసాద్ తల్లి మందలింపుని మాత్రం లక్ష్యపెట్టలేదు. చివరకు ప్రసాద్, నీల రిజిస్టర్ మ్యారేజి చేసుకున్నారు.

నీల సంసార బాధ్యత వహించేదికాదు. నిరంతరం పార్టీలకు, షాపింగుకు తిరుగుతూ మితిలేని

ఖర్చుచేసేది. వివాహమైన తరువాతకూడ నీల పర పురుషులతో చాల ఫ్రీగా తిరగడం ప్రసాద్‌కు సహించరానిదైంది. కాని ఆమె అతన్ని లక్ష్యపెట్ట లేదు. భార్యా భర్తలకు వివాదాలు వచ్చాయి. శేషమ్మ ప్రసాద్ ధోరణిచూచి విరక్తిచెంది జోగయ్య వద్దకు వెళ్ళిపోయింది. ప్రసాద్‌కు సంసార సౌఖ్యం శూన్యమైంది. నీల కలహించి తండ్రివద్దకు వెళ్ళి పోయింది.

సుఖమూ, ఆదరణాకరువైన ప్రసాద్ మనశ్శాం తికి దూరమైనాడు. దేవతవంటి శారదను తిరస్కరిం చడం మూర్ఖమని విచారించసాగాడు.

♦ ♦ ♦

కట్నాలిచ్చే పరిస్థితిలో లేని జోగయ్య శారదకే సంబంధమూ కుదర్చలేకపోయాడు. ప్రసాద్ వివా హం చేసుకున్నాడని శేషమ్మ ద్వారా విన్న శారద తన బాధనిక అణచుకోలేకపోయింది. ప్రసాద్‌కి చివరిసారిగా ఉత్తరం వ్రాసింది.

♦ ♦ ♦

తల్లిని, మేనమామనిచూచి కొన్నాళ్ళు ఉందామని ప్రసాద్ భావించాడు. బట్టలు సర్దుకుంటూంటే నౌఖరు ఉత్తరం తెచ్చియిచ్చాడు. ఆత్రుతగా విప్పాడు.

బావా!

నా సర్వస్వమనుకున్న నీవు నన్ను నిరాకరించాక నా బ్రతుకే వ్యర్థం. ఏనాటికైనా మారతావేమో ననే మొండి ఆశతో నేను యిన్నాళ్ళూ బ్రతికాను. కాని నీవు పూర్తిగా దూరమైనావు. అవును! నేనే విషయంలోనూ నీకు తగను. అందుకే విధి మనని వేరు పరచిందేమో? ఇక యీ శారద ప్రపంచంలో ఉండదు. నిరంతరం నీసౌఖ్యాన్ని కాంక్షించే-'శారద'

ప్రసాద్ కళ్ళవెంట నీళ్ళు కారాయి. తన తిరస్కృతి శారద మరణానికి దారితీసిందని బాధతో క్రుంగి పోయాడు. ఆమె పంపిన ఫొటోను చేతుల్లోకి తీసు కున్నాడు.

శారద అందమైన కళ్ళను విశాలంగా విప్పుకొని అమాయకంగా చూస్తూంది. 'నన్ను మన్నించవూ శారదా!' అంటూ ఫొటోను హృదయానికి అదుము కున్నాడు.



అనేకుల పాదాల క్రిందపడి నలిగిన పాము తననీ కష్టాలనుంచి గట్టెక్కించమని దైవాన్ని కోరింది. ఆ మొరవిని దేవుడన్నాడు కదా "నిన్ను తొక్కిన మొదటివాణ్ణే నువ్వు కాటేసివుంటే, రెండోవాడు జాగ్రత్తగా ఆలోచించి మరీ అడుగు వేసేవాడు!"

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తి కలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.




AL-87-1 TELUGU

ఏకపాత్రాభినయం

# నిలువుటద్దాలు

శ్రీ ఆరుద్ర

(దూరంనుంచి దగ్గిర అవుతున్నట్లూ, తిరిగి దూరంగా పోతున్నట్లు సన్నాయీ, డోలూ వినిపిస్తూవుంటాయి. వాటి హోరు దూరంగా వెళ్ళినప్పుడు చిన్న నవ్వు విన్పిస్తుంది. మళ్ళీ వాయిద్యాల హోరుని చీల్చుకుంటూ గట్టిగా నవ్వు వినిపిస్తుంది. వెనువెంటనే ఒక ఆడ గొంతుక)

ఎవరేనా వింటే ఏమనుకుంటారు? కొత్త పెళ్లికూతురికి సిగ్గేనా లేదూ అనుకోరూ? అయినా ఆ వాయిద్యాలు వింటుంటే— వింటుంటే... (చిన్న నవ్వు) చిన్నప్పటి సంగీతం మేష్టారు జ్ఞాపకం వస్తున్నాడు. పెద్ద మామయ్య ఆయన్ని తీసుకొచ్చిననాడు— రామ రామ. ఆ పిడీ గట్రా చూసి డోలో సన్నాయో వాయిస్తాడనుకుంటే హార్మణీ శృతిచేసి గొంతుకతో పాడతాట్ట. వినే సరికి... ఛత్, ఏమిటా నవ్వు... అంటూ పెద్ద మామయ్య గదిమేశాడు.

(నిట్టూరుస్తూ) పెద్ద మామయ్య లేడు. ఆనాటి నేను నేనూ కాదు. ఆరోజులు జ్ఞాపకానికి తెచ్చుకుంటూవుంటే ... నిలువుటద్దాల లోలా రక రకాల వ్యక్తులు రకరకాల మాటలు చెప్తూ కళ్లముందు నిలుస్తారు.

అద్దంముందు నుంచుంటే యింత పెద్దదాన్న యానా అనిపిస్తుంది.

కోడెదూడలాగ ఎన్నాళ్ళు? ఏబడుద్ధాయినో వెతికి ముక్కుకి తాడేయించాలి... అంటూ వేళాకోళం చేసే పెద్దమావయ్య యేడీ?... (గట్టిగా) పెద్దమామయ్యా యిదిగో చూడు. యిప్పుడు నీ సీతికేంచేస్తున్నారో చూడు.

(కంఠధ్వనిని మింగేస్తూ డోలూ సన్నాయీ... మళ్ళీ గొంతుక)

అబ్బబ్బ. చెవులు హోరెత్తిపోతున్నాయి. పెళ్లంటే యీ హోరు వుండితీరాలికాబోలు. హుఁ చిన్నన్నయ్య వుంటే యివన్నీ సాగనిచ్చేవాడా? అబ్బే. వాడి తరహాయే వేరు. ఎప్పుడూ నవ్వుతూ ఎంతనవ్విస్తూ వుండేవాడనీ...

(విచారం ధ్వనించే స్వరంతో) ఈ యింట్లో ఎవరూ నవ్వకూడదు. నవ్వడం సభ్యతా లక్షణం కాదు. చెడిపోయినవాళ్ళే నవ్వుతారు. హుఁ. నాన్నగారి తత్వం అది. ఆతత్వానికెదురాడి యింట్లో వుండడానికి వీల్లేదు. అందుకే అన్నయ్య యింట్లో వుండకుండా పోయాడు... చిన్ని సీతి పెళ్లికదా అనేనా రాలేదు... అవును ఎలా వస్తాడు. యీ గడప యిక తొక్కను అంటే ఎందుకొస్తాడూ! పోనీలే వాడేనా హాయిగా వున్నాడు... ఎవరి ముఖాన నవ్వు వెల్లని యీ యింట్లో వుండడంకంటే ఏచెట్టుక్రిందేనా హాయిగా వుంటుంది.

నేనెలావుంటానోకదా?... నాన్న దృష్టిలో నాకు బుద్ధి చెప్పడం పెళ్ళి చెయ్యడం... హుఁ... పుట్టి పెరిగిన యింట్లో ఏవకళ్ళకీ అర్థంకాని తను ఏనాడూ ముక్కూ ముఖం ఎరుగని చూడని యీ పెద్దమనిషికి అర్థం అవుతుందా? కల్ల... (ఎవరో తలుపు తట్టిన చప్పుడు)

అబ్బబ్బ, అమ్మే అయ్యుంటుంది. తలుపు తెరిస్తినా తుఫానులాగా మీదికి వస్తుంది. (ఎవరి కంఠస్వరాన్నో అనుకరిస్తున్నట్లు) నాతల్లే చీరె సింగారించేసరికి పట్టం మాటుపడేలావుంది. తెవులూ. ఎంతసేపూ... (నవ్వుతూ) అవును— ముహూర్తం మూడు నిముషాలు లేటని తెలుస్తే మూడూళ్ళు తిరిగొద్దునన్నాట్ట వెనకటికి ఒక అల్లుడు... దేవుడిదయవల్ల అంతకంటె మంచి వుద్యోగమే మావారిది... వారు... (ఎవరినో పిలుస్తున్నట్లు) ఏమండీ, మిమ్మల్నే. (ఆగి) సుందరబావని ఒకే దగ్గిర్నుంచి బావా దాకా పిలచిన తను ఎవర్నైనా ఆత్మీయులని ఎలాగ ఏమండీ? అంటూ పిలవడం' ఎబ్బెట్టుగా వుండదూ? మహారాజులాగా అదేవస్తుంది అమ్మ చెప్పినట్లు...

అమ్మకీ నాకూ యెంతో పోలికుందంటారు. నావయస్సులో అమ్మ యిలాగా వుండేది కాబోలు! వాలుజడ ముందుకి వేసుకుని వెనక్కి వేసుకునీ అద్దంలో విగ్రహం అంతేసీ ఒక్కమారు చూసుకోవాలని యిలాగే అష్టవంకర్లూ తిరిగిపోయేదేమో... మరి నాన్నగారు... (నవ్వుతూ) అమ్మ అంటూనేవుంటుందిగా. పాతికేళ్లయి చూస్తున్నాను యీ మనిషిని- ఏంమార్పు లేదు అని... యీ మార్పులేని మనిషితో బ్రతికి బ్రతికి అమ్మ అందుకే ఇలా అయిందేమో!

(మంత్రాలు చదువుతున్నట్లు దూరంనుంచి విన్పిస్తుంది)

అరె, పెళ్ళికూతురు లేకుండానే చదువుతున్నట్లుందే... మళ్ళీవచ్చి అమ్మ తిట్టకుండా తెమలాలి... ఎన్నిసార్లు విప్పివేసినా యీ జడ ఒక్కొక్కరోజు చస్తే కుదరదుకదా... నాకూ ఆ లలితకిలా పొట్టి జుట్టువుంటే ఎంతబాగుణ్ణు. పొట్టిగా జుట్టు కత్తేసుకుని ఎన్నిసార్లు యీ అద్దంలో చూసుకున్నానో... ఎంబాగుందని ... నిక్షేపంలాగా బారెడు జడవుంటే అదేవిటే అంటూ బుగ్గలు నొక్కుకుంటుంది అమ్మ. అబ్బబ్బ. యీ అమ్మకి చస్తే నచ్చచెప్పలేం కదా... ఇంత వయసు వచ్చాక పెళ్లిచేస్తూ బుగ్గకి చుక్కా కాళ్ళకి పారాణీ... నలుగురిలోకీ వెళ్లి కూర్చుందుకూడా సిగ్గేస్తూంది.... లక్షణంగా పెళ్ళికూతుర్ని చేస్తే అదేవిటే- యీ అమ్మకి అన్నీ వింతే. మాట్లాడితే మేం అలాగా అంటూ మొదలుపెడుతుంది.

నిజమే (క్షణం విరామం) అమ్మ కాలంలో అలాగామరి. అమ్మ పుట్టగానే పెళ్లికి తాత అన్నీ నిశ్చయం చేసేశాట్ట. మూడోయేట ప్రధానం. ఐదోయేట పెళ్ళి .. ఎంతో లక్షణంగా జరిగిపోయాయిట. అదేనయం... యిన్నేళ్ళు వచ్చేదాకా వూరుకుని కాలేజీ చదువూ గట్రా చదివించి నచ్చాడా? లేదా? అన్న ప్రసక్తే లేకుండా అదిగో ఆ అబ్బాయిని నిశ్చయించాం. ఎల్లుండే పెళ్ళి. అంటే... యిన్నాళ్ళపాటూ ఏమైనా ఆశలు చిగురించితే వాటిని తృంచెయ్యాలి. (ఆవేశంగా) పెరిగిన వ్యక్తిత్వాన్ని మూలంటా నరికెయ్యాలి. ప్రాణాలు తీసుకోవాలి...

నాకీపెళ్ళొద్దు. నేను సుందరబావని తప్పించి ఎవర్నీ చేసుకోను. కచ్చితంగా చెప్పలేక పోయావా సీతా అంటుంది లలిత. (ఎవర్నో వుద్దేశించి అన్నట్లు) లల్లీ, లల్లీ, నీకేలా తెలుస్తుంది నేనెన్నిసార్లు చెప్పాలని చూశానో ఏంచెయ్యమన్నావు? బావకి వుద్యోగం వుంది. ఆస్థిలేదు. యీ పెళ్లికొడుక్కి ఆస్థీవుంది. పేరుకి వుద్యోగం వుంది. మా నాన్న తత్వం తెలుసుగా లల్లీ... సత్తువైన యినప్పెట్టెకి ఆడపిల్లల్ని కట్టబెట్టాలి. (హేళనగా) అందంగానానా కొరుక్కు తింటామా? ఏంచెయ్యను లల్లీ. (ఏడుస్తుంది సన్నాయి హోరు పెరిగి దూరంగా పోతున్నట్లు వెక్కి వెక్కి ఏడ్పు దాన్ని దాటుకుని వినిపి

స్తుంది. (ఏడుస్తూనే) సుందరం బావా ఎక్కడున్నావు? సీతనింత అన్యాయంగా కాలతన్నేస్తావా బావా? మనం కట్టుకున్న తియ్యటి వూహాల మేడలు ఏమైపోయాయి? కలసి మెలసి మనం గడపదలచిన బ్రతుకేదీ బావా? ఏదీ? ఏమైపోయింది?

(క్షణం విరామం. తేరుకున్న గొంతుకతో)

అవును. నీకూ వేళాకోళంగా తోస్తుంది. యీ ఆఖరు ఘడియల్లో నా వాపోతలు చూస్తే. ఇదంతా ప్రేమే అయితే నాన్నగారికి చెప్పలేక పోయావా? అంటావు.... నిజమే. ఎందుకు చెప్పలేను, చెప్తాను. ఆలస్యం అయినా యిప్పుడైనా చెప్తాను. (ఆవేశంగా) చెప్పినా వినక పోతే ఎక్కడికైనా పారిపోతాను. యీగుక్కిడు ప్రాణాలూ తీసుకుంటాను... (క్షణం విరామం తరువాత హేళన ధ్వనిస్తూ చిన్నగా నవ్వు)

ఊహాలు ముందుకి పరుగులు తీస్తుంటే కాళ్ళకి కళ్లేలు బిగుసుకుంటున్నాయి. ఓ అడుగు ముందుకీ ఏడడుగులు వెనక్కీ ఎక్కడికి? ...నీ ముఖంమీద విచారం కన్పిస్తే భరించలేను సీతా అనే బావ లేడు. నీ ఆశయాలూ, కోరికలూ నెరవేరేలా చూస్తాను. ఆ బాధ్యత నాది అని ధైర్యం చెప్పే చిన్నన్న లేడు. సీతా నీకేం ఫరవాలేదు అంటూ భరోసా యిచ్చే పెద్దమామయ్య లేడు... ఎవరూ లేరు... హుః.... నీకు బుద్ధి రావాలంటే యిదొక్కటే మార్గం అటారు నాన్న. నీకేం తెలియదు వూరుకోవే. అంతా నీమంచికే అంటుంది అమ్మ ... అమ్మ ఎంత వెర్రిబాగులది....

ఎంత సంతోషం ప్రదర్శిద్దామన్నా ఏమిటీ కన్నీళ్ళు? ఎందుకీ కరిగిన కలలని పోగుచెయ్యాలన్న ప్రయత్నం?... త్వరగా వెళ్లి నలుగురి మధ్యా కూర్చుంటాను. అప్పుడే వూహాలు నన్ను వెంట తరమవు. బాజా భజంత్రీల గోలలో నాయీ హృదయపు రొద నాకు కూడ విన్పిచదు. అదే నయం.

(క్షణం విరామం)

సీతా, సీతా, ఏమిటీ హడావిడి. ఎందుకింత తొందర?...

ఇంకా తొందరంటావేం? అమ్మ అప్పుడే అయిదుసార్లు తట్టింది తలుపు.... వచ్చేస్తున్నానమ్మా, అయిపోయింది.

(నవ్వు) అమ్మకాదోయ్ చిట్టితల్లీ పిలుస్తుంట నువ్వే..

నేనా. నేనా? ఎవర్ని ఎవర్ని పిలుస్తుంట? ఎందుకు పిలుస్తుంట? నాకెవరి అవసరం లేదే!

బాగా ఆలోచించుకో. నీ అంతరాంతరాల్లోకి ఓసారి చూసుకో. నీ హృదయం నీతో చెప్తూంది. విను. తప్పేంలేదు.

ఒద్దు వద్దు. హృదయం చెప్పనూవద్దు. నేను విననూవద్దు. చాలుచాలు. యీ వూహాల బాకుల పోట్లు యిక చాలు.

సీతా. ఎంత అమాయకురాలివి. చూడు ఎప్పుడూ ముట్టుకోనైనా ముట్టుకోని కదంబాన్ని సింగారించుకుంటున్నావు. అవ్వ...

అవును. అదిచవక. అందుకే నాన్నగారికి నచ్చుతుంది. నాన్నగారికి నచ్చినది అమ్మకి నచ్చుతుంది. నాకూ అదే నయం....నువ్వెవరు నన్నెందుకిలా దెప్పుతావు? వెళ్ళు, నే తెమలాలి.

సీతా. మల్లెలు తప్పించి నీకేం బాగుండవు. నువ్వు అవే పెట్టుకోవాలి. నీకోసం కాకపోయినా నా కోసం, నా కోసం....

అబ్బా...వద్దు నాకేం జ్ఞాపకం చెయ్యకు. నా హృదయంలో పొంగిపొరలిన ఆనందం పాల పొంగు. అది యిప్పుడు లేదు. నువ్వు నన్ను వేధించకు.

ఆ హృదయం యీరోజున ఏమైపోయింది? ఆ వూహాలపాటు పోట్లకి తృళ్ళితుళ్ళిపడుతూంది ....తూట్లుపడి యమబాధ పెడుతూంది...(ఏడుస్తుంది)

సీతా నువ్వొట్టి పిచ్చిదానివి. గతాన్ని తవ్వుకు ఎందుకూ బాధపడతావు?

నీకేం నువ్వెన్నైనా కబుర్లు చెప్తావు గట్టున వుండి...నా గతి? (ఏడుపుస్వరంతోనే) వూహాలు తీగెలు సాగే సమయంలో ఎందుకీ పెద్దలు బావతో చనువుగా తిరగనిచ్చారు? బావని పెళ్ళాడుతావులే అంటూ ఎందుకు వేళాకోళాలు చేశారు?

హుఁ (హేళనగా నవ్వి) యిలా క్రూరంగా విడతియ్యడానికి.

చెప్పకు. తెలుస్తూనేవుంది. నన్నింకా బాధ పెట్టకు...(తలుపు తట్టిన చప్పుడు)

సీతా, సీతా ఒక్క మాట...నిజంగా యీ పెళ్ళికి ఎందుకు ఒప్పుకున్నావు? నిజంగా ప్రేమించేనా?

నువ్వు నోర్ముయ్. ప్రేమ. ప్రేమ. ఎక్కడుంది ప్రేమ? కనిపెంచిన తల్లి తండ్రుల హృదయంలో లేనిది – నువ్వు లేకుంటే బ్రతకలేనన్న బావ గుండెల్లో లేనిది – నాకెందుకు? నన్ను వేధించకు. నువ్వెవరవో నేను గుర్తించను. అంతరాత్మ నాకొద్దు. హాయిగా సంసారం చేసుకుంటాను.

(నవ్వుతూ) మరి చదువుకునే రోజుల్లో ప్రేమించే...

అబ్బబ్బ, నన్ను వేధించకు. ప్రాణం విసిగించకు. ఇదిగో ఆఖరుసారి చెప్తున్నా. నాకు ఆదర్శాలు వద్దు. అంతరాత్మల పోరు అంతకంటె వద్దు. పెళ్ళిపెద్దలు చేస్తారు. సంసారం నేనీదుకు వస్తాను. మధ్య నీకెందుకీ బాధ....

అంతేనంటావా?

ఆహాఁ అంతే. ఇంకా వేధిస్తే యిదిగో యీ పన్నీరుబుడ్డి నీ ముఖాన విసురుతాను. వెళ్ళు. కిక్కురుమనకుండా పడుండే నీకీవేళ తెలివెలా వచ్చింది....

సీతా, ఒక్క మాట...బావ యిచ్చిన పట్టు చీర....కట్టుకో...(నవ్వు)

అంత హేళనగా వుందా....(అద్దం పగిలిన చప్పుడు) అరె. ఆవేశంలో అద్దాన్ని పగల గొట్టాను. ఆ అంతరాత్మ పగులుతుందా? (విచారంగా నవ్వుతూ) ఏం అపశకునం అంటూ అమ్మ రాకుండా యీ పెంకులన్నీ ఎత్తెయ్యాలి.

అద్దం నన్నేం చేసింది?

అంతరాత్మ నన్నేం చేసింది?

అద్దం నన్ను నాకు చూపింది. అంతరాత్మ నిద్రలేచి పాత తలపోతలతో బాధ రేపింది. చాలింక. ఇంక చాలీ సింగారం....ఆయన చీదరించుకుంటారు. అత్తగారు విసుక్కుంటుంది. ఆడబొడుచులు దెప్పుతారు. యిరుగుపొరుగులు నవ్వుకుంటారు. అయితేమటుకు. అది జీవితం. దాన్నించి తప్పించుకు ఎక్కడికి పారిపోవడం? వెనక చూపు వద్దు. ముందు చూడాలి నేను...

(డోలూ సన్నాయి చప్పుడు. దానితోపాటే తలుపు తెరచిన చప్పుడు. ఒక్కసారి వాద్యాలు విజృంభించి మ్రోగి అతినిశ్శబ్దంలో కలిసిపోతాయి.)

(రేడియో ప్రసారితం)

కథానిక

# పరిష్కారం

శ్రీ కోడాలి హరిప్రసాదరావు

గంటమూడవసారి వినబడగానే మాష్టర్లంతా ఎవరి క్లాసుకు వారు వెళ్ళిపోయారు. "మీకు క్లాసు లేదా మాష్టారూ...." సూర్యం మాష్టారు పల్కరించేవరకూ మోహనరావుకు తన క్లాసు సంగతే జ్ఞప్తిలేదు. "ఉన్నదండి...." అంటూనే హడావిడిగా అడుగుబెట్టాడు తన క్లాసులో. అల్లరి ఆపుజేసి పిల్లలంతా యెంతో బుద్ధిమంతుల్లా నిలబడ్డారు. "సిట్ డౌన్ ప్లీజ్" అని తన సీటులో కూలబడ్డాడు. క్లాసులో ఉన్నాడేగాని తన మనసు మనసులో లేదు. క్లాసంతా ఒక్కసారి కలయి జూశాడు నిర్లిప్తంగా. ఆడపిల్లలు ముందు వరసలో కూర్చున్నారు పుస్తకాలు తెరచిచూస్తూ. ఆ వెనుక మొగపిల్లలు. అంతా నిశ్శబ్దంగా ఉంది. కాగితం క్రిందపడినా శబ్దం వినిపించేటంత ప్రశాంతంగావుంది క్లాసు. కాని మాష్టారు మనస్సు మాత్రం ఆందోళనా పూరితం. ఎంత వద్దనుకున్నా తనకా ఆలోచన వస్తూనే ఉంది తన మనస్సుకు చికాకుకలుగజేస్తూ. పుస్తకము తెరచి టేబిలు మీద ఉంచాడు పాఠాని కుపక్రమిస్తూ. కాని ఏ పేజీ తెరచినా జానకి ప్రతిబింబమే. తనకంతా అయోమయంగా తోచింది. పుస్తకాన్ని మూసేశాడు. విద్యార్థులంతా ఆదుర్దాగా చూస్తున్నారు యీ రోజు ప్రశ్నలడుగుతారోనని. అలాగే పదినిమిషాలు దొర్లిపోయింది. అంతా నిశ్శబ్దం. మరల ఒక్కసారి క్లాసంతా కలయజూశాడు. ఈసారి క్లాసంతా నలభైమంది జానకీ ప్రతిబింబాలుగా కనిపించింది. ఒడలంతాగగుర్పొడిచింది. హృదయం వేగంగా కొట్టుకోసాగింది. "వేణూ! క్లాసు చూస్తూ ఉండవోయ్" బయటికి వచ్చేశాడు. సరాసరి హెడ్మాష్టరు రూములోనికి వెళ్ళి సెలవుచీటీ యిస్తూ, "విపరీతమైన తలనొప్పిగా ఉంది సార్!" ఎలాగో బయటపడ్డాడు.

రోడ్డు వెంట నడుస్తున్నాడే కాని ఎదురుగా ఏమొస్తున్నాయో గూడ గమనిక లేదు. "మాష్టారూ!" అంటూ తన నెవరో ప్రక్కకు తప్పించకుంటే ఆ రోజు యాక్సిడెంటు జరిగేదే.

"ఏం నాయనా! స్కూలుకు వెళ్ళలేదా!" కనిపిస్తూనే అడిగింది తల్లి.

"లేదమ్మా! వెళ్ళాను. తలనొప్పిగా ఉండి సెలవు పెట్టి వచ్చేశాను," ఎన్నడూ తల్లితో అబద్ధం చెప్పనిదీ రోజు తనకు తెలియకుండానే అనేశాడు.

"ఉండు మీ నాన్నగారితో చెప్పి ఆ మందులషాప్‌కి వెళ్ళి ఏదైనా మందు తెప్పిస్తాను; యింతలో కాస్తకాఫీ కాస్తాను" అంటూనే "ఏమండీ" అని పిలిచింది కంగారు పడుతూ.

"నా కేమి వద్దమ్మా, కాస్త కాఫీ యివ్వు" తన గదిలోకి పోయి వాలుకుర్చీలో చతికిలబడ్డాడు.

"ప్రొద్దుట బాగానే ఉన్నావుగా నాయనా! ఎందుచేత బాబు యింతలోనే! ఏదైనా మందు తీసుకోపోతే ఎలా? పోనీ ఆ తులశమ్మగారినడిగి జామా ఆయిల్ తీసుకురానా, కొంచెం రుద్దితే తగ్గుతుందేమో!" కాఫీ యిస్తూ అడిగింది తల్లి.

ఇంతలో తండ్రికూడ వచ్చాడు, "మోహనూ! ఎలా ఉందిరా. యిదిగో యీ టేబ్లెట్ గూడ తీసుకుని కాఫీ తాగు, అదే తగ్గుతుంది. ఈ గదిలో ఎందుకు గాలి లేకుండా, అలా పెరట్లో కుర్చీ లాక్కొని కూర్చో చల్లగాలికి...అయితే యివ్వాళ లీవు పెట్టావా?"

"అవును" ముక్తసరిగా జవాబిచ్చాడు. ఆ క్షణంలో నాల్గు సంవత్సరాల క్రితం అదే గదిలో నాన్నకు, జానకి తండ్రికి జరిగిన సంఘర్షణ తన మస్తిష్కంలో మెదిలింది. చివరిసారిగ నాన్న అన్న మాటలు "మీ మాట ప్రకారం పూర్తిగా యీ గడువు లోపల యివ్వకుంటే మీ అమ్మాయికి యీ యింట్లో స్థానం ఉండదనేది గుర్తుంచుకోండి" తల్చుకుంటే బల్లెపు పోటుల్లా తన హృదయాన్ని గాయపరుస్తున్నాయి. ఆనాడు తన మామగారు "నువ్వేమంటా?" వన్నట్లు చూచిన జాలిచూపులు మెదిలాయి తన కళ్ళల్లో. ఆనాడు తనేమి మాట్లాడలేదు.

"వస్తాన్నాయనా !" నిస్పృహాయతలో తిరిగివెళ్ళిన మామ గారిని తలంచుకొంటే, తన అసమర్థతకు, తనకే సిగ్గు వేసింది. మనుష్యుల్నికూడ త్రాసులో పెట్టి మోసం లెక్కలు కట్టే వ్యాపారస్తుడిలా అనిపించింది తండ్రి మనస్తత్వం. ఆలోచించే కొద్దీ నాన్న చేతిలో కీలు బొమ్మలా సృష్టించుకొన్నాడు తనను.

ఆనాడు సాయంకాలంవరకు తన గదిలోనే గడి పాడు. ఈలోపు అమ్మ ఎన్నిసార్లొచ్చి గొడవపడిందో లెక్కలేదు. రెండు మూడుసార్లు నాన్నగూడ వచ్చి పరామర్శించాడు. చల్లగాలికి తిరగమని హెచ్చరించాడు. స్నానంచేసి బట్టలు మార్చుకొని అలా పార్కుదాకా తిరిగివద్దామని బయలుదేరాడు. ఎక్కడ కూర్చున్నా తన మనసుకేమి శాంతి లభించలా. సినిమాకు వెళ్దామని హాలువరకూ వెళ్ళాడు. కానీ అదీ మనస్కరించలా.

రాత్రి భోజనాల దగ్గర అమ్మ మరీ బెంబేలుపడింది తను సరిగా భోజనం చేయనందుకు. మరి ఆమె కేం తెల్సు తన మనస్సులో జరిగే సంఘర్షన. ఒకటి రెండు సార్లు కాఫీ యిచ్చింది. తనకు రాత్రంతా జాగరణే.... నాల్గు సంవత్సరాల తర్వాత జానకి ఫొటో చూడటం యిదే. పెట్టె తెరచి పెళ్ళినాటి ఫోటోలు చూచుకున్నాడు. ఆమె దీనవదనం తనను మరింత ప్రాధేయపడు తున్నట్లు తోచింది. మరుక్షణంలోనే "జానకి యిప్పు డెంతగా మారిపోయిందో! ఎంత పెద్దదైందో! ఇప్పుడు చూస్తే ఎలా ఉంటుంది......చిక్కిశల్యమై ఎముకల గూడులా........కొనఊపిరితో ఉంటుందేమో !" ఆలో చనలతో దుఃఖం పొంగివచ్చింది.

"అమ్మా! జానకిని తీసుకొచ్చేందుకు వెళ్తున్నా యీ ఏడుగంటల బండికి" కొడుకు మాటలకు తల్లి ఒక్క క్షణం స్పృహ తప్పినంతపనయింది. కోడలు పేరు వినగానే ఆమెకు ఆనందం కల్గినా వెంటనే భర్తరూపం మెదిలింది ఎదురుగా. ఆమెకు ఏమి జవాబివ్వాలో కం గారు కల్గింది. భర్తేమో యింటిదగ్గరలేదు. ఎప్పుడో నాల్గు సంవత్సరాల క్రిందట పాతపడిన గాథగా తోచింది. తను అప్పుడప్పుడా ప్రస్తావన తెచ్చినా, భర్త నోటికి దడిసి అలాగే నోరు నొక్కుకొనేది. అలాంటిదీ రోజు హఠాత్తుగా కొడుకే అందులోను తీసుకొస్తానని బయలు దేరుతున్నానంటే ఆమెకు ఒక ప్రక్క ఆనందం, యింకో ప్రక్క ఏదో ప్రళయం ముంచుకొస్తున్నట్టు భయం కల్గింది. తండ్రి కొడుకుల మధ్య ఎలాంటి విపత్తురానున్నదోనని ఆమె ఒక ఘడియ దిగ్భ్రాంతిలో మునిగింది. జవాబు ఆశించకుండానే వెళ్ళిపోయాడు మోహన్. ఆమె కేదో భయం భయంగా ఉంది. ఏపని చేయబోయినా భయంగానే తోచింది.

మధ్యాహ్నం యింటికి వచ్చిన భర్తకేమి చెప్పలేక పోయిందామె వెంటనే. ఏ పనిచేస్తున్నా పరాకుగాఉంది. భోజనం ముగిసాక మెల్లిగా బిక్కుబిక్కుమంటూ అంది "అబ్బాయి, కోడల్ని తీసుకొస్తానని చెప్పివెళ్ళాడు." ఎప్పుడా ప్రస్తావన తెచ్చినా మండిపడే భర్త ఏమి మాట్లా డలా, ఒక్కసారి ఆమెవంక వికృతంగా చూశాడు. ఆమె నిలువెల్లా వణకిపోయింది. అనేక రకాలైన మార్పులు కనిపించాయి భర్త ముఖంలో. కాని వాటి అర్థాలనామె చదువుకోలేకపోయింది. సాయంకాలంవరకు ఆ విషయాన్ని గురించి ఎవరు నోరెత్తలేదు. ఆమె కేమిటో అంతా భయం భయంగానే ఉంది.

♦ ♦ ♦

ఇల్లు యిల్లంతా ఆశ్చర్యంలో మునిగిపోయిందా రోజు హఠాత్తుగా మోహన్‌రావు రాకకు. జానకికి మరింత ఆశ్చర్యం కలిగింది. ఆమె కేదో కలలా కన్పించింది భర్త రాక. ఎందుకో చెప్పలేనంత సిగ్గువేసింది. ఒడ లంతా ఒక్కసారి పులకరించింది. హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఆవేశాన్ని అణచుకోలేక కనుకొల కుల్లో నీరు తిరిగింది ఆనందాశ్రువుల్లాగ. భర్త తన వంకే చూస్తూంటే మరింత సిగ్గువేసింది. తన గదిలోకి పారిపోయింది ఒక్క గెంతులో. అత్త మామలు చాల అప్యాయంగా పల్కరించారు అల్లుణ్ణి. వాళ్ళ ఆనందానికి అవధులు లేవు. వాళ్ళందరికేదో మేజిక్ జరుగుతున్న ట్లుంది కళ్ళముందు. ఎవరికి వారికే నమ్మశక్యంగాకుంది మోహన్‌రావు రావడం.

"ఓహో! బావగారెప్పుడో హఠాత్తుగా దిగేశారే! కులాసా! అరె! అక్కయ్య కనుపించదే! సరే ఉం డండి నేను కాలేజికి వెళ్ళి సెలవుపెట్టి వచ్చేస్తాను. యివ్వాళ ఉంటారుగా...." సుధ ఎప్పుడూ అంతే. విచార మంటే ఏమిటో తెలియనట్లుగా ఎప్పుడూ చలాకీగా ఉంటుంది. మాట అంతే. మనిషీ అంతే.

నాల్గు సంవత్సరాలరాద్ధాంతం తర్వాత ఆకస్మికంగా అల్లుడువచ్చి జానకిని ఆ రోజే అప్పటికప్పుడే తీసుకెళ్తా నంటే అందరికీ మహావిడ్డూరంగా తోచింది. కొరకరాని కొయ్యలా తయారై కూర్చున్న సమస్య యిట్టే నిమిషా లలో అనుకోకుండా మంచులా కరిగిపోతుందంటే అందరికీ సంతోషమే కల్గింది. కాని అల్లుడు ఆ రోజు

కాకపోయినా ఒకపూటైనా ఉండనందుకు తండ్రికొడుకుల మధ్యేమైనా తగవులు వచ్చాయేమోనని అందరికి సందేహంగానే ఉంది ఒక్క మరదలుకు తప్ప. ఎవరేమనుకున్నా మోహనరావు భార్యను వెంటబెట్టుకొని వచ్చేశాడు వెంట మరెవ్వరూ లేకుండానే.

♦ ♦ ♦

సాయంకాలం రూము తుడుస్తుంటే కనుపించిన కవరును యిచ్చింది భర్తకు మోహన్‌రావు తల్లి.

ఏలూరు,

ది 16-1-'59.

"పూజ్యనీయులైన భర్తగారి పాద పద్మమునకు నమస్కరించి మీ పాదదాసి జానకి వ్రాయునది. నాల్గు నిండు సంవత్సరాల అనంతరం నాకై నేను యీ లేఖ వ్రాస్తున్నందుకు క్షమించవేడుచున్నాను.

ఈ వచ్చే ఉగాదినాటికి మీ దర్శన భాగ్యం కలిగి నాలుగు సంవత్సరాలు నిండుతాయి. ఇంతకాలంనుండి ఏరోజుకారోజే వీక్షణానికాక్షణమే ఎప్పుడు నా యీ జీవితం అంధకారంలోనుండి వెలుగులోకి వస్తుందో, ఆ శుభదినము యింకెంత దూరమోనని ఎదురు తెన్నులు చూస్తున్నాను. లేక అసలీ జీవితం యిలాగే అమావాస్యలతోనే నిండుకుంటుందో అయోమయంగా ఉంది. ఎప్పటికప్పుడే యీ ఆలోచనలతోనే తెల్లవారుతుంది, చీకటి పడుతుంది. ఏ జన్మలో జేసిన పాపకృత్యపు ఫలమో యీ జన్మలో అనుభవిస్తున్నానని పెరిపెట్టుకోనా!

కాని....

మీరు పురుషులు. విజ్ఞులు. ఒకరికి చెప్పదగ్గ ప్రతిభావంతులు. భవిష్యత్తును సానుభూతితో పరికించి, ధైర్యం జేసి మోడుపడ్డ జీవితాన్ని చిగురింప జేయగల సమర్థులు. దూరదృష్టితో పరిశీలిస్తే, శాశ్వతము కాదని చెప్పే ధనంకోసం ఒక అబల నిండుజీవితాన్ని బలిచేయడమనేదెంత కసాయికృత్యమో హృదయాన్ని విప్పి చూడమని వేడుకొంటున్నా. ఆవేశంలో ఏదో వ్రాస్తున్నందుకు మన్నించండి.

మరి....

దైవం నాకెందుకింత కఠినశిక్ష విధిస్తున్నాడో తల్చుకుంటే గుండె బ్రద్దలవుతుంది. అమ్మ నాన్నల విషయం వేరే చెప్పనక్కరలేదు. వాళ్ళకు విచారమే తిండి, నిరాశే జీవితం. పైగా వారి దిగులు నేనెక్కడ చూచి ఏమైపోతానోనని లోలోపలె కుమిలికుమిలి కుళ్ళిపోతున్నారు. ఇలాగే ఎవరికి వారికే హృదయాల్లో నిప్పు రాజుకొని రాజుకొని అగ్నిపర్వతం ఎప్పుడు బ్రద్దలౌతుందో, ఏమో!

ఇరుగుపొరుగు అమ్మలక్కలు, సంఘం నోళ్ళల్లో నా బ్రతుకును గురించి వేరే చెప్పనక్కరలేకుండా పోయిందెప్పుడో. వారికి క్రొత్తగా సమస్యలు దొరికినా, దొరకక్కపోయినా, నిత్యం చర్చనీయమైన సమస్య.

ఒకరు బాధపడ్తుంటే సహాయం చేయలేకపోయినా, సానుభూతి చూపే ఓపికా లేకపోయినా, కనీసం వారి ఖర్మానికి వారిని విడిచిపుచ్చకుండా పైగా ఏడ్పించజూచే వారినిగూడ సృష్టించాడు భగవంతుడెందుకో. ఏ పండుగ వచ్చినా, ఏ పబ్బమువచ్చినా లేక ఏ కాస్తతీరికి దొరికినా, పాత గాథల్ని పైకితీసి మరీ పోతుంటారెంతో ఔదార్యం ఒలకపోస్తూ. అనేకసార్లు బుద్ధిపుట్టింది. నాకై ఎన్ని బావులులేవు. ఎంత నీరులేదు నా యీ కొద్దిపాటి దేహాన్ని యిముడ్చుకొనేందుకు. భయానికి వెరచికాదు. అది యెప్పుడో తొలగింది. అంతకన్నా జీవితంమీద ఆశా అంటే.... అది వున్నా.........ఎవరికొరకు జీవించడం. అందుకే చివరిసారిగ వేడుకొంటున్నా.........భార్యగా స్వీకరించలేకపోయినా, కనీసం మీ పాదదాసిగానైనా కనికరించలేరా? పోనీ మీ నాన్నకు డబ్బే ప్రధానమైతే, ఆ బాకి తీర్చేందుకైనా, మీ యింట్లో ఊడిగం చేయించుకున్నా నా జన్మసార్ధకమే.

నామూలాన్నే మీరుగూడ మోడులా జీవిస్తున్నారనుకుంటే, మీ మనస్సులో నాకోచెల్లాయి స్థానం ఏర్పరచుకుంటే మీ యిద్దరి పాదాలను వొత్తే భాగ్యమైనా కల్గించలేరా?

అర్ధాంగిగా అంగీకరించలేకపోయినా, మీ పాదాల చెంతనైనా కాస్త చోటివ్వలేరనేదే ఉగాది సందేశమైతే, ఏ ఉగాదితో ఆశలు చిగురించి, మొగ్గ తొడిగి, పుష్పించి మధురఫలాలనిస్తుందని, కలలు గన్నానో, ఆ కలలు కల్లలుగానే ఉండిపోతే...క్షమించండి—జానకి.

ఆ రాత్రి తొమ్మిదిగంటల బండికి తిరిగి వచ్చేశాడు మోహన్‌రావు భార్యను వెంటబెట్టుకొని. తండ్రి యిద్దరినీ ఎంతో ఆప్యాయంగా పల్కరించాడు. ఇంక తల్లి ఆనందానికి అవధులేమున్నాయి!

నాల్గు సంవత్సరాలుగా తెగని సమస్యను, బి.ఎ. చదువుతున్న తన మరదలు యింత తేలికగా తీర్చి రెండు జీవితాలను చిగురింప జేసినందుకు మోహన్‌రావేమి ఉగాది కానుక యిచ్చాడో సుధకు?



స్కెచ్

# ఎవరైతేనేం?

శ్రీమతి టి. ప్రభావతి

మొగ సంతానం అయితే పొంగడానికి, ఆడ సంతానం అయితే కృంగడానికి ప్రతి పురిటికి సహజంగా దగ్గర బంధుమిత్రులంతా గుమిగూడుతారు. కాని యిటువంటి వాళ్ళను కొంచెంసేపు ఏడిపించడానికా అన్నట్లు ఆమంత్రసానిగాని, లేడీ డాక్టరుగాని పురుడైన కొద్ది క్షణాల వరకు ఆడపిల్ల అయితే మొగపిల్లవాడని, మొగవాడైతే ఆడపిల్ల అని అబద్ధాలు ఆడి, హాస్యంచేసి, "మా ఖర్మం ఎప్పుడూ ఆడపిల్లే. ఈ వంశానికి మొగ సంతానం ప్రాప్తం లేదుగాబోలు ఏంచేస్తాము" అనే నిస్పృహ మాటలు అందరినోటివెంట రానిచ్చి తర్వాత చల్లగా 'మొగపిల్లవాడేనండి' అని చెపుతారు. ఆమాట వినేవినడం యింత చింత నిరాశ ఎటుపోతుందో ఆముదం త్రాగినట్లుగా తయారైన ఆ ముఖాలు ఆహ్లాదంతో ఒకరికొకరు "నేను చెప్పానుగానంటే మొగపిల్లవాడని, నీవే కాదన్నావు" అంటూ భవిష్యత్ చెప్పడపు నైపుణ్యం బాగా వున్నట్లు పరామర్శించుకుంటూరు.

కొన్ని కుటుంబాలలో ఆడపిల్ల కల్గితే మొగుడుతో ప్రారంభించుకొని, అత్త, మామ, ఆడబిడ్డలు అంతా తృణీకారంగా చూడ్డమే. పాప మా యిల్లాలు ఏం చేస్తుంది? తనకు మాత్రం పుత్ర సంతానం కలగాలని లేదా? కొడుకే కలిగాలని కలలుకంటూ వుండేవాళ్ళంతా వరసను నలుగురు కొడుకులుకంటే అప్పుడూ మళ్ళీ ఏడ్పే. ఎందుకమ్మా యీ అంబోతులు? చేతికి అక్కరకు వస్తారా? ఒక కంచం కడగడానికైనా పనికి రారుగదా! అని గోల పెట్టడమే. మొత్తంమీద సంతృప్తి లేకపోవడమనేది సహజమే అయినా ఆడజన్మ అనేసరికి ఒకవిధమైన చిన్న చూపు, ఎందుకో అర్థంగాని ఆవేదన ఆ తల్లిదండ్రులకు కలుగుతూ వుంటుంది. మొగ సంతానం కలిగిన కోడల్ని నెత్తిని ఎక్కించుకోవడం, ఆడ సంతానం అయితే నీచంగా చూడ్డంకూడా కొన్ని కుటుంబాలలో లేకపోలేదు.

ఎనిమిదవ హెన్రీ పుత్ర సంతానంకోసం ఎంతో మందిని వివాహం చేసుకున్నాడు. కాని ఒక్కరూ అతడి కోర్కె తీర్చలేదు. వారంతా హెన్రీ యొక్క ఆగ్రహానికి గురికావలసి వచ్చినట్లు తెలుస్తోంది. కొడుకుని కనకపోయినందుకు ఎంతో మంది మన కుటుంబాలలోకూడా నీచంగా చూడబడ్డం కనిపిస్తోంది. పెద్ద పెద్ద చదువులు చదివి, డిగ్రీలు సంపాదించిన యువతీ యువకులలో యీ సంకుచిత తత్వం పోవడం మన సమాజానికి ఎంతో మంచిది.

## పురుష సంతానమే కలగాలనే వాంఛకు కారణాలు ఏమిటో!

పూర్వపు యుద్ధాలలో పురుషుల సంఖ్య హెచ్చు అవుసరం వుండేది. ఇప్పుడు అట్లాకాదు. వందమంది సైన్యాన్ని ఒక్క మరఫిరంగి, కొన్నివేల మందిని ఒక్క ఆటంబాంబు హతమార్చేశక్తి యిప్పటి మారణ ఆయుధాలలోవుంది. సైన్యం అభివృద్ధి అవుతున్న కొద్దితక్కువ కాలంలో హెచ్చు నాశనం అవడానికి యంత్రాలు, మందుగుండ్లు, ఏటంబాంబులు తయారుఅయ్యాయి. అప్పుడు వేళ్ళమీద లెక్క పెట్టగల కత్తులు, కటారులు, డాళ్ళు, వీటితోపాటు ఏనుగులు, గుర్రాలు మొదలైనవి వుండేవి. వీటిమీద స్వారీ చేస్తూ యుద్ధం చెయ్యడానికి తగిన శిబ్బంది అవుసరం వుండేది. గనుక అప్పట్లో ఎంత మంది మగవాళ్ళు కలుగుతే అంత ఆనందం కలిగేది. కాగా అవసరంకూడా వుండేది.

ముఖ్యంగా పురుషజాతి అభివృద్ధికి యుద్ధాలే కారణంగా చెప్పబడేవి. ఆడపిల్లల వివాహాల విషయములో తగిన వరుడ్ని సంపాదించడం, బోలెడుకట్నాలు పోయడం, యిదంతా కష్టంగానే అప్పుడూ, యిప్పుడూకూడా వుంది. ఆడదానికి తగిన భర్త దొరకడం అనేది దాని అదృష్టంమీద ఆధారపడివుందని యిప్పటికీ అంటారు.

## ఎవరైతేనేం?

భర్తయొక్క సంపాదనమీదనే ఆధారపడే యిల్లాలు, సంపాదన తగినంతగా లేకపోయినప్పుడు పడేబాధ ఆ యిల్లాలుకు తెలిసినట్లు యితరులకు తెలియదు. సర్వ సామాన్యంగా భర్త సంపాదించి కుటుంబ పోషణ చెయ్యా లని, యింట్లోవుండి తాను యిల్లు నడపాలని సామాన్యంగా ప్రతి స్త్రీ అనుకుంటుందిగా? చేతగాని మొగుడ్ని చేసు కుని, ఆ భర్తను యింట్లో కూర్చోపెట్టి తాను బైట ఏదో పనిచేసి ఆర్జించి కుటుంబాన్ని పోషించాలని ఏ స్త్రీకూడా వాంఛించదు. తాను పెద్ద ఉద్యోగం చేయగల శక్తివంతు రాలై, వేలు ఆర్జిస్తున్నప్పటికి తన భర్తకూడా ఉద్యోగం చెయ్యడమే ఉత్తమంగా భావిస్తుంది. ఈ ఆశయం చాలా ఉదారమైనదని ఒప్పుకోక తప్పదు. ఏ పనిపాటులేకుండా తన కెదురుగా సదా భర్త కూర్చోవాలని ఏ స్త్రీ వాంఛిం చదు. పైపెచ్చు అసహ్యంకూడా పడుతుంది. Pseu do Scientific theory ద్వారా నాగరికత ఏ దేశంలో హెచ్చుగా వుంటే అచ్చట స్త్రీల సంఖ్య పురుషులకంటె హెచ్చు అని తెలుస్తోంది. పురుష సంతానమే కలగాలని గాని, స్త్రీ సంతానమే కలగాలనిగాని అనుకోవడం యిదొక వాంఛ తప్ప తమ చేతుల్లో లేదనే సంగతి మనం గుర్తించాలి.



## ఏలూరులో వయోజనస్త్రీలకు ముఖ్య సదుపాయములతో ఉచిత విద్యావకాశములు

కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘము వారిచే పశ్చిమ గోదావరి జిల్లా మహిళా సంఘము, ఏలూరు, వారికి వయోజన స్త్రీలు 20-35 సం॥ లోపు వారికి 8th Standard ప్రభుత్వ పరీక్షకు రెండు సంవత్సరముల కాలములో 25 మందిని మాత్రమే పంపుటకు ప్రత్యేక సదుపాయ ములతో స్కూలు నడుపుటకు అధికారము యివ్వబడినది. ఇందు ప్రవేశించు విద్యార్థి నులు పరీక్షానంతరము వృత్తి విద్యలలో శిక్షణ పొంది, మూడు సంవత్సరముల కాలము ప్రభుత్వము వారిచే నడుపబడు సంస్థలలో పని చేయుటకు హామీ యిచ్చు వారికే యిందు ప్రవేశము యివ్వబడును.

రెండేళ్ళ కాలములో E. S. L. C. పరీక్షకు పంపబడు కనీసము 5, 6 తర గతులు చదువుకున్న వారికి ప్రత్యేక కమిటి వారిచే నిర్ణయింపబడు, సరియైన అర్హతలుగల విద్యార్థినులకు ఉచిత విద్యా, భోజన, వసతి, వస్త్ర యితర ముఖ్య సదు పాయములు యివ్వబడుననియు, యిందు చేరగోరు విద్యార్థినులు 20-2-59 వ తేది లోపు ఈ క్రింది అడ్రసుకు వివరముల కొరకు వ్రాసి దరఖాస్తులు పెట్టుకొన వలయును.

ఇట్లు

కె. కేశవరావు

కరెస్పాండెంటు,

పశ్చిమ గోదావరి జిల్లా మహిళా సంఘము

ఏలూరు.

కథానిక

# చీర సింగారించేసరికి!!

కుమారి వై. భాస్కరలక్ష్మి

నేను. కాదునేనూ, అబ్బ ! నేను. అయ్యో నేను అని నేను అంటె నేను అని గొడవచేయసాగాయి చీరల దొంతరలు బీరువా తలుపు తీసేసరికల్లా.

లలితకి ఏమి చేయటానికి తోచక అయోమయంగ చూస్తూంది వాటివంక.

ఇదిగో ఈరోజు ఛాన్సు నాది నన్ను తప్పకుండ కట్టుకోవాలి అంది పైఅరలో పైనవున్న కంజీవరం చీర విజయ పతాకాన్ని ఎగురవేస్తూన్నట్లు.

కాస్త తగ్గవే ప్రతీదానికి తగుదునమ్మా అని తయారవుతావు. ఇప్పుడు వెళ్లేది దేముడు కోవెలకా ఏమన్నాన నిన్ను కట్టుకోవటానికి నేను చూడు అందమైన మౌంటెన్ బార్డరుతో ఎలాగ ఉన్నానో జరికి జరి రంగుకి చక్కని లేతరంగుపైగా డాబుగ కనుపిస్తాను అంది బెంగుళూరు టిష్యూ చీర.

ఒహొహో ఏమిడాబు కాస్త జరీఉండి మెరిస్తె సరి పోయిందికాబోలు నలిగావంటె నయాపైసాకిమారవు! ఉతికితే మరినిన్ను చూడనే అక్కరలేదు. నేను చూడు అందానికి అందం మృదువుగ ధరించిన వారికి ఆహ్లాదాన్ని కూర్చె రంగవల్లిలాంటి పమిటంచుతో! అంది మైసూరు చీర.

నూలుచీర అయినా చక్కని ప్రత్యేకత కలిగి చెలాఘణి అవుతాను నిన్ను కట్టుకూడదా అన్నట్టు పక్క చూపులు చూచింది గద్వాల్ చీర. పైఅర చీరలతో ఏది కట్టుకోవాలో అని ఒక నిర్ణయానికి రాలేక పోయింది లలిత.

పోనీకదా అని మధ్య అరలోకి చూచింది అవి

ఆరపైన ఉన్న శాంతిపూర్ చీర వినూత్నమైన పోకడలతో భారతీయ కళాకారుని నైపుణ్యానికి గీటు రాయేమో అతనిహస్త కౌశలానికి పట్టుకొమ్మ అన్నట్లు పసిమి ఛాయల మెరుగుతో తీర్చి దిద్దిన అంచుగలిగి నన్ను ధరించ కూడదూ అన్నట్లుకాస్తా మోడెస్టుగా చూచింది నేనుమాత్రం ఏం తీసిపోయాను. ఎంతో మెత్తగ ఉంటాను ఎన్నిసార్లు కట్టినా నలగను. నన్ను ధరిస్తె ఎంత ముసలివాళ్ళైన చిన్నపిల్లల్లె కనుపిస్తారు. అంటు కాస్తా సన్నాయి నొక్కులు నొక్కింది కాశ్మీర్ చీర.

అరలో అడుగునుండీ కాశీపట్టు బుటాలచీర చూడు అమ్మాయి ! కాలానుగతముగ ఏ కథాకార్యాలకి నన్నే వాడతారు. నేనులేకపోతె మంగళకార్యాలు జరుగనే జరుగవు ఇప్పటి కాలపు పిల్లలు ఎందుకు పనికిరాని చీరలకోసం ఎగపడతారు కాని, మీ అమ్మని గాని మీ అమ్మమ్మనిగాని అడుగు నేను ఎంత అందంగా ఉంటానో చెపుతారు అని పెద్దవాళ్లని సలహా చేయమంది జాలిగా.

ఏం? లలితా ! రెడీయేనా, అన్నాడు అవతలగదిలో నుండి భర్త వేణుగోపాల్ ఆఁ, ఇదిగో పదినిముషాల్లో వచ్చేస్తాను

త్వరగా రావాలి టైముయింక ఎంతోలేదు ఐదున్నరకల్లా ట్రెయినేవస్తూంది అప్పుడే పదినిముషాల తక్కువ అయిదు అయింది నీవు అయిదు అయేసరికి రావాలి.

ఓ అలాగెఅంటు యథాప్రకారంగ బీరువాదగ్గరకు వచ్చింది. ఏచీర కట్టుకోవాల అన్నది యింకా సమస్యగానే కూర్చుంది లలిత మనస్సులో బీరువాకి బిగించిన అద్దంలోకి తన ప్రతిబింబం జాలిగాచూచింది. ఎప్పుడు ఎక్కడికి బయలుదేరిన యింతేనువ్వు తొందరగ తెమలటం అంటు వుండదు. అంటు అంతరాత్మ అద్దంలోంచి మందలించింది. మరి శుభ్రంగ డ్రెస్ అవకపోతె ఎట్లా వచ్చె ఆమె తోటికోడలాయెను. అమెరికా భర్తసమేతంగ వెళ్లి తిరిగి వచ్చిన తరువాత ఇదే తొలిసారిగా తనయింటికి రావటం. ఇంకా ముఖ్య విశేషం ఏమిటంటే తమ పెండికి వారు అమెరికాలోనే ఉండటం

చేత కనీసం ముఖపరిచయమైన తనకులేదు పైగా విదేశాలను దర్శించిన ఆమె వినూత్న విచిత్రమైన వస్తు పరంపరలో ఎంత అందంగా వుంటుందో! మరి తను! ఇలాగ ఉంటె ఎట్లా అన్నట్లు ఆత్మబోధించింది.

అయినా తనకు మాత్రం ఏం తక్కువ. భగవంతుడిచ్చిన రూపలావణ్యం ఉండనే ఉంది. భర్త ఆఫీసరు కదా అందుకు తగిన అధికార హోదాలకు తగినట్లు తనుమాత్రం ఎందుకుండకూడదు అనిపించింది. ఇలాటి ఆలోచనల అవధిలేని తరంగాలు వస్తున్నాయి లలిత మనస్సులో.

ఈసారి ఏచీర చేతికివస్తే అది తీసి కట్టేసుకోవటమే అని నిశ్చయం చేసికొని లలిత ఒక్కసారి బీరువా తలుపు తెరిచింది. తెరిచీ తెరవటం తడవుగ మూడవ అరలోనిఉన్న జార్జెట్ నైలాన్ షిపాన్ చీరలు యావత్తు ఒక్కమారు కాళ్లమీద పడ్డాయి దొంతుగా.

ఏం! లలితా యింకా అవలేదా అన్నాడు ఒక్క రిమయిండర్ యిస్తూ గోపాల్.

ఇదిగో అయిపోయింది వచ్చేస్తున్నాను

అరగంటనుండి ఇలాగె ఇదిగో ఇదిగో అంటూ వాయిదాలు వేస్తున్నావు. మనం స్టేషన్‌కి వెళ్లి రిసీవ్ చేసికొనేలోగా వాళ్లె వచ్చేస్తారులా ఉంది నీలాటి వాళ్లముస్తాబు పూర్తియేసరికి పట్నం మాటు మణుగుతుంది. అన్నాడు

ఈమాటతో లలితకు గాభరా ఎక్కువయింది. ఒక మూలభర్త తొందర చేస్తున్నాడు. ఇంకొక వంక ఏది కట్టుకోవాలో నిశ్చయంకాలేదు పోని భర్త నడిగితే తన సమస్య పరిష్కారం అవుతుందని-

అంతా అయిపోయింది, ఏం చీరా కట్టుకోవాలో మాత్రం డిసైడ్ చేయలేక పోతున్నాను కాస్త మీరు చెప్పకూడదూ! అంది.

ఏమీటి దీనికి ఇంతగా అవస్థపడిపోతున్నావు. పెండ్లికూతురు ముస్తాబు కన్నా ఎక్కువ ఉంది!

నిజంగా లలిత సౌందర్యప్రియ అనటంలో అతిశయోక్తిలేదు ఎక్కడికి వెళ్లిన ఆయా పరిస్థితులకు, ఆయా సంఘటలకు వాతావరణానికితగి అనుకూలంగ చీరలు కట్టడం లలితకి ఒక అలవాటు. కాని తోటి కోడలిని స్టేషనుకు వెళ్లి రిసీవ్ చేసికోటానికి ఏ చీర కట్టుకోవాలో నిర్ణయించుకో లేకపోయింది.

పెండ్లికూతురునైనా బావుండేది అందరూ కలసి అలంకరిస్తారు ఇప్పుడు నా అంతట నేనే ఎంచుకోవాలి అంటె పెద్ద సమస్యఅయి కూర్చుందికాని. అంది అయిన వచ్చినవాళ్లు ఏం వియ్యాలవారా ఏమన్నాన అయ్యోమనం దర్జగా కనుపించాలనటానికి! మా అన్నయ్య వదినే కదూ! నువ్వు ఎమిటో అనుకుంటున్నావు కాని వదిన చాల సింపుల్‌గా వుంటుంది తెలుసా అన్నాడు.

అయినా ఆవిడ అమెరికా వెళ్లివచ్చారు ఎలాగ ఉన్నా బాగానే ఉన్నట్టుంటుంది ఎటొచ్చి యిక్కడ ఉన్నవాళ్లకే ఈ గొడవ అంతా.

అమెరికావిచ్చి నీకు బాగా పట్టుకుందే. ఎన్ని దేశాలు తిరిగిన మనవాళ్లు మనవాళ్ళగానే ఉంటారు అన్నాడు.

వచ్చే ఆవిడ ఏ స్నేహితురాలో ఏ అక్క చెల్లెలో కనీసం ఆడపడుచు అయిన బాగుండేది. తోటికోడలైందికద సహజంగా అత్తా కోడలు అంటె తగవులు ఆడతారని కోడళ్లంటె బెట్టుసరిగ ఉంటారని అనుకున్న లలిత వేణుగోపాల్ మాటకు సమాధానం ఇవ్వక ఆలోచిస్తూ నిలుచుండి పోయింది.

నేను చూడు ఎంత త్వరగా రెడీ అయ్యేనో అయిన మీలా ఇన్నిరకాల బట్టలుండవు మాకు ఎంత శ్రీమంతులయిన ఎంత పెద్ద ఆఫీసర్లయినఉన్న బట్టలను వ్రేళ్లమీద లెక్కింపవచ్చు అన్నాడు

మాకు మాత్రం ఎన్ని జతలున్నా యేమిటి మరీ బడాయి అంది. హాతోస్మి హిమాలయాపర్వతాలను కన్యాకుమారి అగ్రంవరకు ఎన్ని దేశాలున్నాయో, దేశాలేమిటి పొరపాటు ఎన్ని ఊళ్లున్నాయో అన్నిరకాల చీరలున్నాయి అవునా వచ్చిన కొత్తరకం కొనటం నీకే అలవాటు. అయినా చీరలు గొడవ అడుగుతే నేనేంచెస్తాను చెప్పు నీ ఇష్టంవచ్చింది కట్టుకో అదిగో డ్రైవర్ కారుకూడ రెడీ చేసినట్లుంది హారన్ వినిపించింది త్వరగరా అంటు వీధిగుమ్మం దగ్గరకు వచ్చిచూచాడు వేణుగోపాల్.

అరెరె అన్నాయ్యావాళ్లునూ! అప్పుడేవచ్చేరే అన్నాడు సంతోషంతో ఆ అప్పుడే అని ఆశ్చర్యంగా అంటు లలిత వేణుగోపాల్ వెనుకాలెవచ్చి నుంచుంది

కారులోంచి దిగిన బావగారు ట్వీడ్ సూటు కాదు కదా కనీసం మాములు సూటుకూడ కాకుండ భారతీయ పద్ధతి చక్కని ధోవతి ధరించిఉన్నాడు. వెనువెంటనే తోటికోడలు దిగింది.

చక్కని అంచులుగల నేతచీరను. ముచ్చటగ కట్టుకుని లక్షణంగ పెద్ద బొట్టుపెట్టుకుని వివాహితయని తెలుపటానికేమో అనునట్లు, నిండైన నల్లపూసలు మెళ్ళో వేసికొని నూరుపైసల ఆంధ్రత్వ మొలకుతూంది ఆమెలో. ఎంత నిరాడంబరమైన వ్యక్తులు అనిపించకపోలేదు లలితకు. వీరేనా డాక్టరేట్లను అందుకు వచ్చింది అనుకుంది ఆశ్చర్యంతో.

చిరునవ్వుతో వేణుగోపాల్ తన అన్న రామ్ గోపాల్ వదిన శారదను ఆహ్వానించాడు అయ్యో! యింకా స్టేషన్‌కు మేము వద్దామనుకుంటూంటె మీరె వచ్చేశారె అన్నాడు

ఆ మేమేమి పై వాళ్లం ఏమిటి తీసికొని రాకపోతే రాకపోవటానికి అంది వదిన శారద.

అయినా అరగంట క్రిందటనుండి నేను రెడీ, మీ చెల్లెమ్మ ముస్తాబే యింకా పూర్తవలేదు అన్నాడు లలిత వంకచూస్తూ.

మా మరదలు ముస్తాబు పూర్తయేసరికి పూటు మణుగుతుంది కాబోలు అన్నాడు బావగారుకాస్త మరదల్ని హాస్యంచేస్తూ.

చాల్లెండి ఎవరికైన ఏడిపించమంటె మీ తరవాతే. తనకింకా కొత్త మీరు హడలు కొట్టేస్తున్నారు.

బావగారు తోటికోడలు రెండు రోజులున్నారు. ఉన్న రెండు రోజులలో శారద అన్ని విషయాలలో ఎంతో అంత యిదిగ స్వంత అక్క చెల్లెలుకన్నా ఎక్కువగ ప్రేమాభిమానాలతో తోడ్పడింది. ఆమె చూపిన అభిమానంలో లలిత మాతృత్వం చూరగొన్నది. పుస్తకాల ద్వార సినిమా ద్వార తోటికోడలు అంటె ఎంతో బెట్టుసరిగ ఉంటుందని అందులో బావగారి భార్య అయితే మరీ డాబు చెలాయిస్తుందన్న దురభిప్రాయాలు లలితలో పటాపంచలయ్యాయి విద్యావతిననిగాని పైదేశాలు తిరిగివచ్చానని ఎక్కడ కన్పించకుండ తల్లో నాలుకలా తనతో మెలిగిన తోటికోడలికి మనస్సులో ధన్యవాదలర్పించింది లలిత.

తను ఎంత మంచిదండి నిగర్వచూడామణి అనిచెప్పవచ్చు. ఎవరు వదినేనా నేనంటె విన్నావా! ఆవిడేదో దేవలోకంనుండి దిగివచ్చిన దివ్యసుందరిలా వుంటుంది మరినేనొక భూలోక సుందరిలా ముస్తాబవద్దా అన్నావు. అనుకున్నదొకటి జరిగినదొకటి. పాపం బీరువాలోని మంచి చీరలు మూలుగు తున్నాయి ఈ ఒక వాయిల్ చీరతో అన్యాయంగ కనుపించిపోయావు అన్నాడు పరిహాసంగా. పోని నాకేం తక్కువొచ్చింది అందికాస్త ఉడుక్కుని. అబ్బేతక్కువ ఏమిలేదు ముందే ఈ ఉద్దేశంఉంటె ఎంత బాగుండేది అన్నా అంతే అయిన నీకు బీరువా పట్టుచీరలున్నట్లు వదిన కెలా తెలుస్తుంది ఒక్కసారి బీరువా తీసిచూపించ లేకపోయావా! నాకు యిన్నిరకాల చీరలున్నాయి. అందులో ఒకటి కట్టుకుందామనేసరికి మీరే వచ్చేశారు అంతేగాని నాకు లేకకాదు ఈవాయిల్ కట్టుకుంట అని చెప్పవలసింది అన్నాడు హేళనగా. ★

చొప్పదంటు ప్రశ్నలు !!

అరె! ఎప్పుడూ రావడం? (రావడం చూస్తూనే!)

అయ్యో! అలా చిక్కిపోయారేం? (దుక్కలా కన్పిస్తూంటేనే!)

## ఎవరైతేనేం?

భర్తయొక్క సంపాదనమీదనే ఆధారపడే యిల్లాలు, సంపాదన తగినంతగా లేకపోయినప్పుడు పడేబాధ ఆ యిల్లాలుకు తెలిసినట్లు యితరులకు తెలియదు. సర్వసామాన్యంగా భర్త సంపాదించి కుటుంబ పోషణ చెయ్యాలని, యింట్లోవుండి తాను యిల్లు నడపాలని సామాన్యంగా ప్రతి స్త్రీ అనుకుంటుందిగా? చేతగాని మొగుడ్ని చేసుకుని, ఆ భర్తను యింట్లో కూర్చోపెట్టి తాను బైట ఏదో పనిచేసి ఆర్జించి కుటుంబాన్ని పోషించాలని ఏ స్త్రీకూడా వాంఛించదు. తాను పెద్ద ఉద్యోగం చేయగల శక్తివంతురాలై, వేలు ఆర్జిస్తున్నప్పటికి తన భర్తకూడా ఉద్యోగం చెయ్యడమే ఉత్తమంగా భావిస్తుంది. ఈ ఆశయం చాలా ఉదారమైనదని ఒప్పుకోక తప్పదు. ఏ పనిపాటులేకుండా తన కెదురుగా సదా భర్త కూర్చోవాలని ఏ స్త్రీ వాంఛించదు. పైపెచ్చు అసహ్యంకూడా పడుతుంది. Pseu do Scientific theory ద్వారా నాగరికత ఏ దేశంలో హెచ్చుగా వుంటే అచ్చట స్త్రీల సంఖ్య పురుషులకంటె హెచ్చు అని తెలుస్తోంది. పురుష సంతానమే కలగాలని గాని, స్త్రీ సంతానమే కలగాలనిగాని అనుకోవడం యిదొక వాంఛ తప్ప తమ చేతుల్లో లేదనే సంగతి మనం గుర్తించాలి.



## ఏలూరులో వయోజనస్త్రీలకు ముఖ్య సదుపాయములతో ఉచిత విద్యావకాశములు

కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘము వారిచే పశ్చిమ గోదావరి జిల్లా మహిళా సంఘము, ఏలూరు, వారికి వయోజన స్త్రీలు 20-35 సం॥ లోపు వారికి 8th Standard ప్రభుత్వ పరీక్షకు రెండు సంవత్సరముల కాలములో 25 మందిని మాత్రమే పంపుటకు ప్రత్యేక సదుపాయములతో స్కూలు నడుపుటకు అధికారము యివ్వబడినది. ఇందు ప్రవేశించు విద్యార్థినులు పరీక్షానంతరము వృత్తి విద్యలలో శిక్షణ పొంది, మూడు సంవత్సరముల కాలము ప్రభుత్వము వారిచే నడుపబడు సంస్థలలో పని చేయుటకు హామీ యిచ్చు వారికే యిందు ప్రవేశము యివ్వబడును.

రెండేళ్ళ కాలములో E. S. L. C. పరీక్షకు పంపబడు ,కనీసము 5, 6 తరగతులు చదువుకున్న వారికి ప్రత్యేక కమిటి వారిచే నిర్ణయింపబడు, సరియైన అర్హతలుగల విద్యార్థినులకు ఉచిత విద్యా, భోజన, వసతి, వస్త్ర యితర ముఖ్య సదుపాయములు యివ్వబడుననియు, యిందు చేరగోరు విద్యార్థినులు 20-2-59 వ తేది లోపు ఈ క్రింది అడ్రసుకు వివరముల కొరకు వ్రాసి దరఖాస్తులు పెట్టుకొనవలయును.

ఇట్లు
కె. కేశవరావు
కరెస్పాండెంటు,
పశ్చిమ గోదావరి జిల్లా మహిళా సంఘము
ఏలూరు.

కథానిక

# చీర సింగారించేసరికి!!

కుమారి వై. భాస్కరలక్ష్మి

నేను, కాదునేనూ, అబ్బ! నేను, అయ్యో నేను అని నేను అంటె నేను అని గొడవచేయసాగాయి చీరల దొంతరలు బీరువా తలుపు తీసేసరికల్లా.

లలితకి ఏమి చేయటానికి తోచక అయోమయంగ చూస్తూంది వాటివంక.

ఇదిగో ఈరోజు ఛాన్సు నాది నన్ను తప్పకుండ కట్టుకోవాలి అంది పైఅరలో పైనవున్న కంజీవరం చీర విజయ పతాకాన్ని ఎగురవేస్తూన్నట్లు.

కాస్త తగ్గవే ప్రతీదానికి తగుదునమ్మా అని తయారవుతావు. ఇప్పుడు వెళ్లేది దేముడు కోవెలకా ఏమన్నాన నిన్ను కట్టుకోవటానికి నేను చూడు అందమైన మౌంఛెన్ బార్డరుతో ఎలాగ ఉన్నానో జరీకి జరీ రంగుకి చక్కని లేతరంగుపైగా డాబుగ కనుపిస్తాను అంది బెంగుళూరు టిష్యూ చీర.

ఒహొహో ఏమిడాబు కాస్త జరీఉండి మెరిస్తె సరి పోయిందికాబోలు నలిగావంటె నయాపైసాకిమారవు! ఉతికితే మరినిన్ను చూడనే అక్కరలేదు. నేను చూడు అందానికి అందం మృదువుగ ధరించిన వారికి ఆహ్లాదాన్ని కూర్చె రంగవల్లిలాంటి పమిటంచుతో! అంది మైసూరు చీర.

నూలుచీర అయినా చక్కని ప్రత్యేకత కలిగి చెలామణి అవుతాను నిన్ను కట్టుకూడదా అన్నట్టు పక్క చూపులు చూచింది గద్వాల్ చీర. పైఅర చీరలతో ఏది కట్టుకోవాలో అని ఒక నిర్ణయానికి రాలేక పోయింది లలిత.

పోనీకదా అని మధ్య అరలోకి చూచింది అవి

అరపైన ఉన్న శాంతిపూర్ చీర వినూత్నమైన పోకడలతో భారతీయ కళాకారుని నైపుణ్యానికి గీటు రాయేమో అతనిహస్త కౌశలానికి పట్టుకొమ్మ అన్నట్లు పసిమి ఛాయల మెరుగుతో తీర్చి దిద్దిన అంచుగలిగి నన్ను ధరించ కూడదూ అన్నట్లుకాస్తా మోడెస్టుగా చూచింది నేనుమాత్రం ఏం తీసిపోయాను. ఎంతో మెత్తగ ఉంటాను ఎన్నిసార్లు కట్టినా నలగను. నన్ను ధరిస్తె ఎంత ముసలివాళ్ళైన చిన్నపిల్లల్ల కనుపిస్తారు, అంటు కాస్తా సన్నాయి నొక్కులు నొక్కింది కాశ్మీర్ చీర.

అరలో అడుగునుండి కాశిపట్టు బుతాలచీర చూడు అమ్మాయి! కాలానుగతముగ ఏ కథాకార్యాలకి నన్నేవాడతారు. నేనులేకపోతె మంగళకార్యాలు జరుగనే జరుగవు ఇప్పటి కాలపు పిల్లలు ఎందుకు పనికి రాని చీరలకోసం ఎగపడతారు కాని, మీ అమ్మని గాని మీ అమ్మమ్మనిగాని అడుగు నేను ఎంత అందంగా ఉంటానో చెపుతారు అని పెద్దవాళ్లని సలహా చేయమంది జాలిగా.

ఏం? లలితా! రెడీయేనా, అన్నాడు అవతలగదిలో నుండి భర్త వేణుగోపాల్ ఆ, ఇదిగో పదినిముషాల్లో వచ్చేస్తాను

త్వరగా రావాలి టైముయింక ఎంతోలేదు ఐదున్నరకల్లా ట్రెయినేవస్తూంది అప్పుడే పదినిముషాల తక్కువ అయిదు అయింది నీవు అయిదు అయేసరికి రావాలి.

ఓ అలాగెఅంటు యథాప్రకారంగ బీరువాదగ్గరకు వచ్చింది. ఏచీర కట్టుకోవాల అన్నది యింకా సమస్యగానే కూర్చుంది లలిత మనస్సులో బీరువాకి బిగించిన అద్దంలోకి తన ప్రతిబింబం జాలిగాచూచింది. ఎప్పుడు ఎక్కడికి బయలుదేరిన యింతేనువ్వు తొందరగ తెమలటం అంటు వుండదు. అంటు అంతరాత్మ అద్దంలోంచి మందలించింది. మరి శుభ్రంగ డ్రెస్ అవక పోతె ఎట్లా వచ్చె ఆమె తోటికోడలాయెను. ఆమెరికా భర్తసమేతంగ వెళ్లి తిరిగి వచ్చిన తరువాత ఇదే తొలి సారిగా తనయింటికి రావటం. ఇంకా ముఖ్య విశేషం ... అమెరికాలోనే ఉండటం

చేత కనీసం ముఖపరిచయమైన తనకులేదు పైగా విదేశాలను దర్శించిన ఆమె వినూత్న విచిత్రమైన వస్త్ర పరంపరలో ఎంత అందంగా వుంటుందో! మరి తను! ఇలాగ ఉంటె ఎట్లా అన్నట్లు ఆత్మబోధించింది.

అయినా తనకు మాత్రం ఏం తక్కువ. భగవంతుడిచ్చిన రూపలావణ్యాం ఉండనే ఉంది. భర్త ఆఫీసరు కదా. అందుకు తగిన అధికార హోదాలకు తగినట్లు తనుమాత్రం ఎందుకుండకూడదు అనిపించింది. ఇలాటి ఆలోచనల అవధిలేని తరంగాలు వస్తున్నాయి లలిత మనస్సులో.

ఈసారి ఏచీర చేతికివస్తే అది తీసి కట్టేసుకోవటమే అని నిశ్చయం చేసికొని లలిత ఒక్కసారి బీరువా తలుపు తెరిచింది. తెరిచీ తెరవటం తడవుగ మూడవ అరలోనిఉన్న జార్జెట్ నైలాన్ షిపాన్ చీరలు యావత్తు ఒక్కమారు కాళ్లమీద పడ్డాయి దొంతుగా.

ఏం! లలితా యింకా అవలేదా అన్నాడు ఒక్క రిమయిండర్ యిస్తూ గోపాల్.

ఇదిగో అయిపోయింది వచ్చేస్తున్నాను

అరగంటనుండి ఇలాగె ఇదిగో ఇదిగో అంటూ వాయిదాలు వేస్తున్నావు. మనం స్టేషన్‌కి వెళ్లి రిసీవ్ చేసికొనేలోగా వాళ్లె వచ్చెస్తారులా ఉంది నీలాటి వాళ్లముస్తాబు పూర్తియేసరికి పట్నం మాటు మణుగుతుంది. అన్నాడు

ఈమాటతో లలితకు గాభరా ఎక్కువయింది. ఒక మూలభర్త తొందర చేస్తున్నాడు. ఇంకోక వంక ఏది కట్టుకోవాలో నిశ్చయంకాలేదు పోని భర్త నడిగితే తన సమస్య పరిష్కారం అవుతుందని-

అంతా అయిపోయింది, ఏం చీరా కట్టుకోవాలో మాత్రం డిసైడ్ చేయలేక పోతున్నాను కాస్త మీరు చెప్పకూడదూ! అంది.

ఏమీటి దీనికి ఇంతగా అవస్థపడిపోతున్నావు. పెండ్లి కూతురు ముస్తాబు కన్నా ఎక్కువ ఉంది!

నిజంగా లలిత సౌందర్యప్రియ అనటంలో అతిశయోక్తిలేదు ఎక్కడికి వెళ్లిన ఆయా పరిస్థితులకు, ఆయా సంఘటలకు వాతావరణానికితగి అనుకూలంగ చీరలు కట్టడం లలితకి ఒక అలవాటు. కాని తోటి కోడలిని స్టేషనుకు వెళ్లి రిసీవ్ చేసికోటానికి ఏ చీర కట్టుకోవాలో నిర్ణయించుకో లేకపోయింది

పెండ్లికూతురునైనా బావుండేది అందరూ కలసి అలంకరిస్తారు ఇప్పుడు నా అంతట నేనే ఎంచుకోవాలి అంటె పెద్ద సమస్యఅయి కూర్చుందికాని. అంది

అయిన వచ్చినవాళ్లు ఏం వియ్యాలవారా ఏమన్నాన అయ్యోమనం దర్జగా కనుపించాలనటానికి! మా అన్నయ్య వదినే కదూ! నువ్వు ఏమిటో అనుకుంటున్నావు కాని వదిన చాల సింపుల్‌గా వుంటుంది తెలుసా అన్నాడు.

అయినా ఆవిడ అమెరికా వెళ్లివచ్చారు ఎలాగ ఉన్నా బాగానే ఉన్నట్టుంటుంది ఎటొచ్చి యిక్కడ ఉన్నవాళ్లకే ఈ గొడవ అంతా.

అమెరికాపిచ్చి నీకు బాగా పట్టుకుందే. ఎన్ని దేశాలు తిరిగిన మనవాళ్లు మనవాళ్ళగానే ఉంటారు అన్నాడు.

వచ్చే ఆవిడ ఏ స్నేహితురాలో ఏ అక్క చెల్లెలో కనీసం ఆడపడుచు అయిన బాగుండేది. తోటికోడలైందికద సహజంగా అత్తా కోడలు అంటె తగవులు ఆడతారని కోడళ్లంటె బెట్టుసరిగ ఉంటారని అనుకున్న లలిత వేణుగోపాల్ మాటకు సమాధానం ఇవ్వక ఆలోచిస్తూ నిలుచుండి పోయింది.

నేను చూడు ఎంత త్వరగా రెడీ అయ్యేనో అయినా మీలా ఇన్నిరకాల బట్టలుండవు మాకు ఎంత శ్రీమంతులయిన ఎంత పెద్ద ఆఫీసర్లయినఉన్న బట్టలను వ్రేళ్లమీద లెక్కింపవచ్చు అన్నాడు

మాకు మాత్రం ఎన్ని జతలున్నా యేమిటి మరీ బడాయి అంది. హాతోస్మి హిమాలయాపర్వతాలను కన్యాకుమారి అగ్రంవరకు ఎన్ని దేశాలున్నాయో, దేశాలేమిటి పొరపాటు ఎన్ని ఊళ్లున్నాయో అన్ని రకాల చీరలున్నాయి అవునా వచ్చిన కొత్తరకం కొనటం నీకే అలవాటు. అయినా చీరలు గొడవ అడుగుతే నేనేంచెప్తాను చెప్పు నీ ఇష్టంవచ్చింది కట్టుకో అదిగో డ్రైవర్ కారుకూడ రెడీ చేసినట్లుంది హారన్ వినిపించింది త్వరగరా అంటు వీధిగుమ్మం దగ్గరకు వచ్చిచూచాడు వేణుగోపాల్.

అరెరె అన్నాయ్యావాళ్లునూ! అప్పుడేవచ్చేరే అన్నాడు సంతోషంతో ఆ అప్పుడే అని ఆశ్చర్యంగా అంటు లలిత వేణుగోపాల్ వెనుకాలెవచ్చి నుంచుంది

కారులోంచి దిగిన బావగారు ట్వీడ్ సూటు కాదు కదా కనీసం మామూలు సూటుకూడ కాకుండ భార తీయ పద్ధతి చక్కని ధోవతి ధరించిఉన్నాడు. వెను వెంటనే తోటికోడలు దిగింది.

చక్కని అంచులుగల నేతచీరను. ముచ్చటగ కట్టు కుని లక్షణంగ పెద్ద బొట్టుపెట్టుకుని వివాహితయని తెలుపటానికేమో అనునట్లు, నిండైన నల్లపూసలు మెళ్ళో వేసికొని నూరుపైసల ఆంధ్రత్వ మొలకు తూంది ఆమెలో. ఎంత నిరాడంబరమైన వ్యక్తులు అనిపించకపోలేదు లలితకు. వీరేనా డాక్టరేట్లను అందుకు వచ్చింది అనుకుంది ఆశ్చర్యంతో.

చిరునవ్వుతో వేణుగోపాల్ తన అన్న రామ్ గోపాల్ వదిన శారదను ఆహ్వానించాడు అయ్యో! యింకా స్టేషన్‌కు మేము వద్దామనుకుంటూంటె మీరె వచ్చేశారె అన్నాడు

ఆ మేమేమి పైవాళ్లం ఏమిటి తీసికొని రాకపోతే రాకపోవటానికి అంది వదిన శారద.

అయినా అరగంట క్రిందటనుండి నేను రెడీ. మీ చెల్లెమ్మ ముస్తాబే యింకా పూర్తవలేదు అన్నాడు లలిత వంకచూస్తూ.

మా మరదలు ముస్తాబు పూర్తయేసరికి మోటు మణుగుతుంది కాబోలు అన్నాడు బావగారుకాస్త మరదల్ని హాస్యంచేస్తూ.

చాల్లెండి ఎవరికైన ఏడిపించమంటె మీ తరవాతే. తనకింకా కొత్త మీరు హడలు కొట్టెస్తున్నారు.

బావగారు తోటికోడలు రెండు రోజులున్నారు. ఉన్నరెండు రోజులలో శారద అన్ని విషయాలలో ఎంతో అంత యిదిగ స్వంత అక్క చెల్లెలుకన్నా ఎక్కువగ ప్రేమాభిమానాలతో తోడ్పడింది. ఆమె చూపిన అభిమానంలో లలిత మాతృత్వం చూర గొన్నది. పుస్తకాల ద్వార సినిమా ద్వార తోటి కోడలు అంటె ఎంతో బెట్టుసరిగ ఉంటుందని అం దులో బావగారి భార్య అయితే మరీ డాబు చెలా యిస్తుందన్న దురభిప్రాయాలు లలితలో పటాపంచ లయ్యాయి విద్యావతిననిగాని పైదేశాలు తిరిగివచ్చా నని ఎక్కడ కన్పించకుండ తల్లో నాలుకలా తనతో మెలిగిన తోటికోడలికి మనస్సులో ధన్యవాదలర్పిం చింది లలిత.

తను ఎంత మంచిదండి నిగర్వచూడామణి అనిచెప్ప వచ్చు. ఎవరు వదినేనా నేనంటె విన్నావా! ఆవిడేదో దేవలోకంనుండి దిగివచ్చిన దివ్యసుందరిలా వుంటుంది మరినేనొక భూలోక సుందరిలా ముస్తాబవద్దా అన్నావు. అనుకున్నదొకటి జరిగినదొకటి. పాపం బీరువాలోని మంచి చీరలు మూల్గుగు తున్నాయి ఈ ఒక వాయిల్ చీరతో అన్యాయంగ కనుపించిపోయావు అన్నాడు పరిహాసంగా. పోని నాకేం తక్కువొచ్చింది అందికాస్త ఉడుక్కుని. అబ్బేతక్కువ ఏమిలేదు ముందే ఈ ఉద్దేశంఉంటె ఎంత బాగుండేది అన్నా అంతే అయిన నీకు బీరువా పట్టుచీరలున్నట్లు వదిన కెలా తెలుస్తుంది ఒక్కసారి బీరువా తీసిచూపించ లేక పోయావా! నాకు యిన్నిరకాల చీరలున్నాయి. అందులో ఒకటి కట్టుకుందామనేసరికి మీరే వచ్చేశారు అంతేగాని నాకు లేకకాదు ఈవాయిల్ కట్టుకుంట అని చెప్పవలసింది అన్నాడు హేళనగా. ★

చొప్పదంటు ప్రశ్నలు !!

అరె! ఎప్పుడూ రావడం? (రావడం చూస్తూనే!)

అయ్యో! అలా చిక్కిపోయారేం? (దుక్కలా కన్పిస్తూంటేనే!)

కథానిక

# సాహసించిన మగువ

శ్రీ రమణశ్రీ

పార్వతి డాబామీద పిట్టగోడ నానుకొని, కన్నీటి తెర మీద నీడలా పడిన ఆలోచనలతో తాడుతెగిన గాలి పటాల్ని ఎగరవేస్తోంది. కంటి మీద కునుకు ముద్రవిడి పోయి చెల్లాచెదరైంది! ఔను. ఈ రోజెలా నిద్ర పడుతుంది? ఏళ్ళతరపడి జీవితం...సుఖదుఃఖాలు .... ఆశల ఆశయాలూ....అన్నింటిని బంధించి ఒకసూత్రంలో ముద్రవేసి పారేసింది.

ఎవరి దారి వారు చూసుకొన్నారు....ఎందుకీ అర్థంలేని వ్యథ? పార్వతీ? అని ప్రశ్నిస్తే, 'ఎన్నాళ్ళీ ముసుగులో గుద్దులాట! ఆయన కోసం ఎదురుచూసి' చూసి... కళ్లు కాయలుకాచాయి. దీనితో అంతుతేలాలి' అంటుంది తను.

విపరీతమైన వానలతో వరదలతో పొంగుతోన్న యేరు తన గుండెల దగ్గర మళుపు తిరుగుతోంది...

బోసిపోయిన మెడ నించి వెన్నెల సన్నని వెలుతురులు స్రవిస్తూ జారిపోతోంది. నుదుటిమీద సిందూర తిలకం.... ఈ శరీరం.......దీనిలో తెపతెపలాడుతూ వెలుగుతోన్న ఆత్మ!

ఇన్సూరు చేసిన పార్శిలుతాలూకు ముద్ర విప్పిచూసు కొంటారు వెలవెల బోతారు. పశ్చాత్తాపంతో, దుఃఖంతో, అనుమానంతో అవమానంతో దహించుకపోతారు. తను ఐదేళ్లక్రితం కట్టిన మంగళసూత్రం తన్ని తిరిగి చేరి పోయిందని, పార్వతి మీద ఎలాంటి బాధ్యతా, ఆశా అక్కరలేదని... తేలిక పడతారు. తనలో ఐక్యమైయిన అవతరణం కోసం ఒక్క కన్నీటి కణంతర్పణం విడుస్తారు! కాకపోతే, కర్తవ్యంకోసం.... కలవళం పడి దిక్కు తోచక, కొట్టుమిట్టాడుతూ, 'క్షమించవూ?' అని తన కాళ్ళమీద పడ్డానికి వస్తారా?

ఇవన్నీ లేనిపోని ఆలోచనలు? ఆశలు....ఐదేళ్ళ కాపురంలో రవంతయినా అర్థం చేసుకోలేకపోయిన తన భర్త పూర్తిగా వదిలిపెట్టేసినట్టే అనుకొంటుంది లోకం!....

లోకంపోకడకి ప్రశ్నార్థకంగా ఆయన కట్టిన మంగళ సూత్రం ఇన్సూరెన్సు చేసి ఆయనకే పంపేసింది! ఇన్నాళ్ళ నించి చేయలేని, ఏ స్త్రీకైనా ఇట్టే అర్థమయే. ఆవేశాన్ని మనస్తత్వాన్ని పదిల పఱుచుకొని, లోకానికి సవాలుగా భర్తల కగ్నిపరీక్షగా పంపించింది. రామున్న పరిణామాలాకోసం ఎదురు చూస్తూ....

ఎదురు ..ఎన్నాళ్ల నించి ఎదురుచూసింది? తన భర్త కోసం! తన్ని ఆప్యాయంగా వచ్చి తీసుకెడతారని... ఎంతో కాలం ఆయన కోసం, ఆయన ఉత్తరం కోసం... ఎదురుచూసింది. ఇంత కాలం తమ పంతం నెగ్గించుకుంటారని....అనుకోలేదు...

ఐదేళ్ళు నిరాఘాటంగా కాలచక్రం తిరిగి పోయింది. నేడీనాడు ఒక్కింతసేపు తన వైపు నిలిచి చూస్తోంది. విష దంతాల కాలచక్రం రాపాడిన గుండెల చుట్టూ గాయం రేగుతోంది!

ఇన్నాళ్ళు ఇదేనా అనుభవం? తల్లిదండ్రుల గుండెల మీద అగ్నిగుండంగా రగుల్తోన్న తనకి విశ్రాంతి ఎక్కడిది?

'అమాత్రం ఆత్మాభిమానం లేకపోతే, ఆడదయి పుట్టెందుకు? రాకపోతే మానె ... నీవిక్కడే వుండు పార్వతీ!' అన్నాడు అన్నయ్య.

'ఎన్నాళ్ళిలా? కాపురంలో నిప్పులు చెరుక్కుని' 'తిట్టినా కొట్టినా రాచి అంపాన పెట్టినా మొగుడనే వాణ్ణి వొదలిపెట్టకూడదు. ఈ సంసారంలో అదేసంస్కారం.... స్త్రీగా అంతకంటెయేంచెప్పను?' అని వాపోయింది. అమ్మ

ఇక తండ్రి యెటూగాక తన్ని చూసి గుటకలు మింగుతూ, 'దీర్ఘ సుమంగళీ భవ' అని దీవిస్తూ తన కోసం ఇన్ని కన్నీళ్ళు దోసిట్లో పోసుకుని ఉదయ సంధ్యలలో అర్ఘ్య మిచ్చేవాడు!

ఈ రోజుతో ఒక అగ్ని పరీక్ష!

ఆర్థికంగా విలువ కట్టుకొన్న మంగళసూత్రం.... తప్పక తీసేసుకొంటారు! అందుకు సందేహించరు. ఆయన స్వభావం అలాటింది. తను కాపురం చేసినంత కాలం పుట్టింటి నించి, తెచ్చుకొన్న ప్రతీ విలువని హరించేసేవారు ఒక్క స్మృతి చిహ్నంగా మిగలనివ్వకండా...ఐనా తను సహించింది. వయస్సుకి మించిన అనుభవంతో భరించింది. ముద్దు ముచ్చటలు తీరవలసిన కాలం...సంసారంలో విలయమై పోయింది.

ఇన్నాళ్ళు ఏం చేస్తున్నారు? ఏం బావుకుంటున్నారు తన్ను కాదని ...

తన అత్తగారు! అత్త పాత్ర చక్కగా నిర్వహిస్తున్నననే ఉత్తమ నటకురాలు! ఆవిడ సుఖపడలేదు. తన్ని సుఖపడనివ్వలేదు. పొద్దుణ్ణుంచి, సాయంకాలం వరకూ సాయం చేస్తూన్నా సరే, దెప్పిపొడిచేది, ఏవీ పని చేయడంలేదని, సాగాదీసుకొనేది. దానికి సంతానయోగం లేదుట! యిదొహటి తోడు మాకు! హాస్పిటళ్ళకే పోస్తున్నాం బోలెడంత సొమ్ము. ఒక్కగానొక్క కొడుకు. వంశవృక్షం పెరగడానికి ఆడదికదమ్మా మూలం? అదే లేకపోతే, ఉండేమి ఊడేమి? గొడ్రాలుగా బతికేకంటె, గొడ్డులా బతకడం మంచిది

తన వియోగానికిదోకారణం?

సాటి స్త్రీపట్ల సానుభూతిలేని అత్తగారు. ఏనాటి ద్వేషమో వెదలగ్రక్కుతూండేది.

ఆవిడమాత్ర ఆడదికాదు! ఆడదానికి, ఆడదానిమీద ఆమాత్రం ఉండదా? కష్ట సుఖాలు అర్థంకావా? ఏనాటికైనా న్యాయం చేకూరదా?... అని సహించింది. కాని భర్తకూడా కేవల భావంగా తన అవసరాలకి 'ఊ' కొట్టి ఊరుకొనేవాడు. కాని అణువంత చలనం లేదు.

అత్తగారి వంశ పరంపరా వస్తూన్న హక్కులాంటి చలాయింపు తగ్గకపోయేసరికి. తనూ తిరగబడింది. భర్తముందే ఎదురు వాదించింది. వ్యతిరేకించి సమాధానం ఇవ్వడానికి జంకలేదు. తన్నీవిధంగా తయారు చేసింది వాళ్ళే! అని కుములి కుమిలి ఏడ్చింది. తన్ని రెచ్చగొట్టింది వాళ్ళే!... అందులో తన భర్తకూడా కలుస్తున్నందుకు మరింత క్రుంగిపోయింది.

తనొక్కర్తి ఒకటి... అందుకే తనకీశిక్ష!

ఆరోజు తను యింటికి రాసిన ఉత్తరం.... ఎందుకు కడుపు చించుకొంటే కాళ్ళమీదపడుతుంది.

ఉత్తరం అత్తగారి కళ్ళబడింది. యింకేం! సందు దొరికింది చాలు తనమీద విప్లవించిపోవడానికి!

అయ్యో! 'అయ్యో! కొంపకు నిప్పేట్టేస్తోందిరా! వాళ్ళ పుట్టింటివాళ్ళందర్నీ మనమీద దండెత్తమని రాస్తోంది. ఈ ఆడదానికి పుట్టగతులుంటాయా? దాన్ని మనింట్లోంచి తరిమి తరిమి కొడుతున్నామట. ఒక రాతా? ఒక యేడుపా? బరిమీద తెగించిపోయింది. దీనికి తగిన శాస్తి చెయ్యకపోతే మనం బతకలేం?'

ఆ ఉత్తరం ముక్కలు ముక్కలు చించి ముఖాన వేసింది. ఈ గృహ కలహాల మధ్య, అశాంతి మధ్య ఆయనకసలు శాంతి వుండేదికాదు! ఈ మాటలు విని, తన్ని మింగేలా చూశారు. ఆరోజు తలగడలో తల దూర్చి వెక్కి వెక్కి యేడ్చిన దృశ్యం ఈనాటికీ గుండె తెరమీద తుపానులా రేగుతోంది. అంతే! నాటి నుంచి పగ! తనమీద తారాడే భుజంగాల పగ!...

ఇంత కక్ష సాధించాల్సినంత తన నేరం? ఆడదిగా పుట్టడమేనా?

ఒకనాడు తనే పెద్ద పోట్లాట జీవితానికి అంతిమ కార్యక్రమంలా లేవదీసింది.

వాదోప వాదాలతో, మానవాంతర్గతమైన రాక్షసత్వం పదే పదే విజృంభించిపోయింది. దాంతో ఆ యింటికీ తనకీ ఋణం తీరిందనిపించిది. భర్త మూర్ఖంగా ఇంటి నుంచి గెంటివేశాడనే చెప్పాలి! అధఃపాతాళానికి క్రుంగిపోయి, ఆయన కాళ్ళావేళ్ళా పడింది. కన్నీళ్ళతో పాదాలు కడిగింది.

'నన్ను క్షమించండి! ఇంకెప్పుడూ ఇలాచేయను'.... అని వాపోయింది.

'పుట్టింట్లో పడుండు కొన్నాళ్ళు. నీకు బుద్ధి రావాలి. అంటూ ఫెడీల్మని డొక్కలో తన్నాడు. అబ్బ! ఆ వేధని తన నరాలు యంత్రీకరించుకొని పునరావృత్తం చేస్తున్నయ్!

అంతే! ఆరోజునించి నేటివరకూ....

తన తల్లిదండ్రులు జీవన భృతికోసం మనోవర్తి దావా వేస్తామన్నారు. తనే ఆపుచేస్తూ వచ్చింది. ఇన్నాళ్ళు!

నాల్గయిదేళ్ళలో ఒక్కసారికూడా ఆయన ముఖం కనిపించలేదు. ఎప్పుడూ మౌనంగా ముడుచుకుపోయి

ఉండే ఆ పెదవులు.... ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూవుండే ఆ కనులు ... ఏనాడు మర్చిపోలేదు.

తనలో ఏలోపం లేదని ఘోషించడంలేదు. ఆ లోపాన్ని పాప కూపంగా, మహానేరంగా భావించి, భర్తపక్షమంతా పక్షుల్లా చెంచుపుటాలతో త్రవ్వి త్రవ్వి తన తలకెత్తారు !....

చుట్టూ పరిసరాలవైపు, వెన్నెలవైపు, ఆకాశంలో నక్షత్రాలవైపు.... నిట్టూర్పులు నిగుడిస్తూ చూసింది పార్వతి. అర్ధరాత్రి పన్నెండు గంటలు....

శరత్కాంతులలో మరుగుతోన్న తన శరీరం.... చామనఛాయగా.... సానుభూతిగా మగిలిపోయిన హృదయం.. . తన అందాలకి మగవాళ్ళంతా బందీలు కాకపోవచ్చు. కాని తన యౌవనం నిరంతరం అందంగా వుండడానికి ప్రయత్నిస్తూనేవుంది.

ఇక.... ఈ నాల్గయిదేళ్ళలో.... ఊరికే కూర్చోలేక కుట్టుమిషన్‌మీద పని నేర్చుకొంది. మొగుడొదిలేసిన మగువగా చెలామణీ అవుతూ. హాయిదా పద్ధతిమీద సెంటరునించి, మిషన్ తెచ్చి పని చేసుకొంటూ, తన కాళ్ళమీద తను నిలబడ్డాననే అనుకొంది. మిషన్ చప్పుళ్ళు ఇంటి జీవన సంగీతానికి శృతి వేస్తూనే వున్నయ్ !

తల్లిదండ్రులు ప్రోత్సాహం పుష్కలంగా లభించిన, ఈకార్యక్రమం నిరాటంకంగా సాగుతూనేవుంది !

ఇది జీవనోపాధి ! దీన్ని మించిన బ్రతుకులేదు. అందుకే తన శరీరమింత ధైర్యం కూడగట్టుకొని, మనస్సు బలపడి, నరాలు సడలిపోకండా మంగళ సూత్రాన్ని దాని కర్తదగ్గరకు పంపివేయడానికి సాహసించింది.

♦ ♦ ♦

'మంగళసూత్రం మెడలో గొంగళి పురుగులా తిరుగుతోంది కాబోలు ! మొగుడనేవాడికి పంపించివేసింది' అని వ్యాఖ్యానించారు ఊళ్ళోవాళ్ళు !

రెండుమూడు రోజులకి ఇన్సూరు పార్సిలు తిరిగి వచ్చింది. 'ఆయన పుచ్చుకోరట !' అని దాంతో ఒక ఉత్తరం—

'ఇలాంటి పనెప్పుడూ చేయకు ! నేను రెండో వివాహం చేసుకోబోతున్నాను.'

తను సంపాదనలో ప్రయోజకురాయిందని ఆయనకి తెలియదుకాబోలు పాపం ! తనేదో సాధించాననుకొంటే, వాళ్ళే తనమీద పగ సాధించారు.

'మళ్ళీ ఆయనకే పంపించండి.' వెళ్ళండి ! ఆ మంగళసూత్రం మళ్ళీ ఈ జన్మలో ధరించను ! ఆయన మొహాన్నే కొట్టండి ! మళ్ళీ పెళ్ళిట ! దానిమెళ్ళో యిది ఉరిత్రాడులా బిగించమనండి ! పుచ్చుకోపోతే... అక్కడే పారేయమనండి !'

పోష్టుమేన్ బిత్తరపోయాడు. మళ్ళీ వెనక్కి తిరిగి చూడకండా ముందుకు సాగిపోయాడు.

చూస్తూ, చూస్తూ ఎంత ద్రోహం !

'ఏవిఁటి వచ్చింది ?' అనడిగింది తల్లి.

'అదే నేను ఇన్సూరుచేసిన పార్శిలు తిరిగివచ్చింది. మళ్ళీ ఆయనకే పంపమన్నాను. రెండో పెళ్ళిట...'

'ఆఁ' అని గుటకలుమింగింది తల్లి. చొక్కా కాజాలు కుడుతోన్న సూది బొటనవ్రేల్లో చురుక్కుమంది.

భారంగా మిషన్ ముందు కూర్చుంది పార్వతి. హృదయానికి శ్రుతివేస్తూ కుట్టుమిషను చప్పుళ్ళు చేసుకుంటూ తిరిగింది. కాని, సూదిలో సూత్రం లేదు. క్రింద గుడ్డమీద వరసగా రంధ్రాలు మాత్రం పడుతున్నాయి. ఎందుకు కుడుతున్నట్టు ? ఈ ఆవేశం ఈర్ష్యగా జుగుప్సగా కసిగా మారుతోందని తనకు తెలియదు. జీవితంలో ఇంక ఆశించవలసిందిలేదు. ఎటు చూసినా కటిక చీకటి !

తండ్రికి తెలిసి నిట్టూర్చాడు. 'మనోవర్తికి దావా పడేస్తాను. ఇక ఊరుకొనేదిలేదు' అన్నాడు అన్నయ్య. తన ఉనికి సహించలేని, తన కుటుంబం వదిలించుకోవాలని, అన్ని కోణాలనించి, చూస్తూన్నట్టుంది.'

ఎప్పుడో అందరి పాపం బద్దలౌతుంది !

ఈ మధ్య ఈ వేదనలో పని వెనక్కి పడిపోయింది. కుట్టవలసిన బట్టలు, తన గుండెల్ని కప్పుకొని ఏడుస్తున్నాయి.

ఒకనాటి బాధకాదు. పేరుకొని పేరుకొని అగ్ని పర్వతం ఒక్కసారి బద్దలైంది. ఆనకట్ట నదీవేగంలో అట్టడుక్కి క్రుంగిపోయింది.

'ఆ పెళ్ళేలాగైనా ఆగిపోతే...' అనుకొంది పార్వతి - 'నీకేం అధికారంవుంది ? నిన్ను లక్షించే

వాళ్ళు ఎవరు ? నీవెలాగూ సుఖపడలేక పొయ్యావు. ఆయన్నయినా సుఖపడనీ...' అని అంతరాంతరాళం ఆక్రోశించింది.

మూడు దశాబ్దాలకి దగ్గరబడుతోన్న వయసు కోరికల్ని చప్పరించికొని ప్రక్కున నవ్వింది. అనుభూతి సానుభూతిగా చూసింది.

'నీకు విలువలేదు' అని ఘోషించింది మానసంలో సముద్రం....దిక్కులు కిక్కురుమనకండా తన వెంపు నిక్కి నిక్కి చూశాయి.

ఇల్లంతా ఆవురుమంటోంది.

ఉత్తరం వ్రాయడానికి కాగితం కలం తీసింది

'ఈ పాపం అంతా మీదే! నాకు ద్రోహంచేసింది చాలక మరో అమాయకురాలు గొంతుకెందుకు కోస్తారు? మీ కుటుంబంలో వాళ్ళు మనుషులు కారు....'

కాక....ఎవరు ? కాగితం చింపి పారేసింది ఏమి వ్రాయడానికి దిక్కు తోచడంలేదు కలానికి !

అందరిమీద నేర మారోపిస్తు. తన అక్క సంతా కాగితాలమీద కక్కాలనుకొంది. పురుషుని అహంకారంలో స్త్రీనిలానసగా గ్రహించడం తగదని....గట్టిగా వ్రాయాలనిపించింది. చివరికేమీ వ్రాయలేకనూపోవచ్చు. ఏది వ్రాసినా, అది తన అహం! బాధ్యతలేని బతుకు!... చెడిందెలాగూ చెడింది వ్యవహారం. దీని అంతు చూడాలి! నిండా మునిగిపోతే, యింకెక్కడి చలి ? ఎలాగైనా సాధించాలి !

ఎలాగైతేనేం, ఉత్తరం పూర్తి చేసింది.... ఈ ఏడేళ్ళ అనుభవాల్ని గురించి... చివర వ్రాస్తూ, 'బాని సత్వానికి సంకెళ్ళెలాంటివో, స్త్రీకి మంగళసూత్ర అలాంటిదని నిరూపించారు మీరు ! ఈసారైనా తిరగ్గొట్టకండి ! నా స్మృతి చిహ్నంగా, మీకాబోయే భార్య మెడలో ఆదే సూత్రం తగిలించండి!' అని పూర్తిచేసింది

తిరిగి ఉత్తరం చదువుకొని, బాధగా మూలిగి నవ్వుకొంది. ఆయనకూడా నవ్వుకోవచ్చు ! తనకోసం కొన్ని కన్నీళ్ళయినా వ్యయించవచ్చు తన అమాయకత్వానికి, తనకి జరిగిన అన్యాయానికి. ఈ ఉత్తరం తీసి సవితికి చూపించి, ఇద్దరూ కలిసి నవ్వుకోవచ్చు. ఇంతకంటే ఏం సాధించదు. ఏం సాధించదా ? ఏమో ;...

ఉత్తరం స్వయంగా పోస్టు చేసింది.

మళ్ళీ ఇన్నూరు తిరిగిపోయింది.

పార్వతి వళ్ళు మండిపోయింది.

పోస్టడువాళ్ళు విసుగెత్తిపోయారు. డెలెటరాఫీసు శ్మశానంలో చితిపేర్చుకొన్నదా పార్శిలు....

మగవానిముందు తన్నోడిపోయినట్టే తీసుకుంటే ! సంతాలకు తక్కువరాని, తన మనస్సు బాగా అర్థం కావాలి అవతలివాళ్ళకి !

ఆదే రోజు మిషనుమీద అలసట లేకండా పని చేసింది అదే తన సంతృప్తి....

తన ఉత్తరానికి సమాధానంకోసం వేగిపోయింది ఎదురు చూసింది. ఒక ఉత్తరం...ఒక శుభలేఖ....

'నీవు మిషనుమీద బతుకుతున్నావని సంతోషించాను. చాలా బావుంది. నీకు తగిన పని... నీవల్ల ఏ కుటుంబానికి ఇక ఉపయోగంలేదని తెలుసుకునుంటావు ! అందుకే ఏదో వృత్తి నేర్చుకున్నావు. నాలుగురాళ్ళు సంపాదించుకొంటూ, నీ కాళ్ళమీద నీవు నిలబడగలిగావు. మా కొత్త జీవితాన్ని ఆశీర్వదిస్తావని అనుకొన్నాను. ఉత్తరం చదువుతూన్నంతసేపూ నరాల్లో విద్యుత్తు ప్రవహిస్తూవుంది. శుభలేక కోరగా చూసింది. ముక్కలు ముక్కలుగా చించాలనే! వేళ్ళు వణికాయి.

ఇంటిల్లిపాదీ విస్తుపోయిచూశారు. ఎవరికీ అన్నం సయించక అంతా వస్తు.

'మన కర్మ !....' అని వూరుకొన్నారు.

తన మంగళసూత్రం విలువకట్టి వేలంవేస్తారు తపాలావాళ్ళు. తన జీవిత మాంగల్యాన్ని విలువ గట్ట గలిగి ఖరీదుచేసే షరాబెవ్వరు ? ఎవ్వరూ లేరు !

పిట్టపోరూ, పిట్టపోరూ పిల్లి తీర్చినట్టు మధ్యతపాలా వాళ్ళు బాగుపడతారు !

పార్వతి బోసిపోయిన మెడ హోరునవిలపించింది. నుదుటిమీద సిందూరతిలకం కోపారుణంగా మూర్ఛిల్లింది. కనురెప్పలు జీవనభారాన్ని మోయలేక ఆలోచనలకి క్రుంగిపోయినయ్.

ఆ విషాదతరంగంలోనే,' అన్నయ్యా ! మనోవర్తికి, దావా పడెయ్యవూ?' అని తలవంచుకొంది. 

# రెండు గొప్ప లాభాలు



మెట్రిక్ విధాన తూకాలు, కొలతలకు మార్పువల్ల మనకు రెండు ప్రధాన విధాలలో లాభిస్తుంది. మన దేశంలో ప్రస్తుతం అనుసరింపబడుతూన్న నానా పద్ధతుల మూలాన కలుగు కలతలు, నష్టాలూ అంతరిస్తాయి.



అంతర రాష్ట్రీయంగా అనుసరింపబడుతూన్న ఒకే పద్ధతిని మనమూ వాడకంలోకి తెగలుగుతాము. మెట్రిక్ పద్ధతిని ప్రపంచమంతటా గల అన్నిదేశాలూ అంగీకరించాయి.

ఈ ద్విముఖోద్దేశ పద్ధతిని సాధించడానికి తొలిమెట్టుగా ఇది మనదేశంలో [illegible] కొన్ని కొన్ని రాష్ట్రప్రదేశాలలోనూ, పరిశ్రమలలోనూ [illegible] ప్రవేశ పెట్టబడి యున్నది.







సులభతరం
చేయడానికి
ఏకరీతి
వాడకానికీ

# టిక్కెట్టు లేకుండా చేసే ప్రయాణాన్ని అరికట్టాలి...

## టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేయడం గౌరవకరమైన విషయం కాదు.



ప్రయాణీకులకు సుఖప్రయాణం చేకూర్చడం కోసం
టిక్కెట్లు లేకుండా చేస్తున్న ప్రయాణాలను
పూర్తిగా అరికట్టాలి.

అట్లా చేయడానికి, దయచేసి మాకు
సాయపడండి! టిక్కెట్టు లేకుండా ప్రయాణం
చేస్తున్న వ్యక్తి మీ కంటబడిన ప్రతిసారి,
టిక్కెట్లను పరీక్షచేసే ఉద్యోగికి అతనిని
చూపించండి! ఈ అసౌకర్య కారణాన్ని, దేశానికి
వాటిల్లుతున్న నష్టాన్ని నివారించడం నిమిత్తం,
అందరి హృదయపూర్వక సహకారం అవసరం.

— దక్షిణ రైల్వేచే ప్రకటించబడినది



# విద్యార్థినులకి వీడ్కోలు

ఫిబ్రవరి తొమ్మిదోతేదీనాడు ఆంధ్రమహిళాసభ మెట్రిక్ (బెనారెస్; ఆంధ్ర) విద్యార్థినులకు వీడ్కోలు యివ్వ డానికి మిగిలిన విద్యార్థినులు విందు ఏర్పాటు చేశారు. ఈ విందులో మహిళాసభ కార్యదర్శినులు, ఉపాధ్యాయినీ బృందం, కొందరాహూతులు; శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ మొదలైన వారందరూ కడు వుత్సాహంతో పాల్గొన్నారు.

తేనీటి విందుకు తదుపరి వినోద కార్యక్రమం ఏర్పాటు చేయబడింది.

కార్యక్రమం చూస్తేనే చాలు ఆంధ్రమహిళ సంకుచిత భాషా భేషజాలకు స్వస్తిచెప్పిందని. ఆనాటి కార్య క్రమంలో హిందీ, పంజాబీ, గుజరాతీ తమిళ కన్నడాలు అన్నీవున్నాయి.

సీనియరు విద్యార్థినులకు వీడ్కోలు యిస్తూ జూని యరువారు "ఒక సంస్థలో అక్కచెల్లెళ్ళుగా మనలి యీనాటికి విడిపోతున్నాం. అందుకెంత విచారంగా వుందో మాటలలో పొందుపరచడం కష్టం. అయినా మీరు వెళ్ళడం శుభసూచకం. ముందు జీవితంలో సుఖంగా వుండండి. మీకు అన్ని అంగాలలోనూ జయం కల్గాలని కోరుతున్నాం" అన్నారు.

దీనికి సమాధానం సీనియరువారు చెప్పారు, 'మా అడుగుజాడలలో నడచినా, మీరూ మీ విద్యాలయపు పరువు ప్రతిష్టలు నిలపెట్టండి' అన్నారు.

తరువాత శ్రీమతి దుర్గాబాయిగారిని మాట్లాడవల సిందిగా కోరారు విద్యార్థులు.

ఆమె మాట్లాడుతూ, ఆంధ్రమహిళ తొలినాటి విష యాలు జ్ఞప్తికి తెచ్చారు. ఎక్కడవున్నా సంస్థను మరిచి పోకుండా వుంటే సంతోషిస్తానని అన్నారు. తరువాత విద్యాలయానికీ, హాస్టలుకీ తమ అమూల్యమైన సేవలను అంకితం చేసిన వుపాధ్యాయినులకీ, వార్డెనుకీ కృతజ్ఞ చెప్పారు. జన గణ మన గానంతో ఆరోజు కార్యక్రమం ముగిసింది. ★

---

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of January '59.

OUT-PATIENT REGISTER

| | |
|---|---|
| No. of Surgical cases treated | 65 |
| „ „ Medical „ „ | 1,469 |
| „ „ Ante-natal „ „ | 359 |
| „ „ Post-natal „ „ | 172 |
| „ „ E.E.N.T. „ „ | 92 |
| „ „ Gyneac „ „ | 196 |
| „ „ Dental „ „ | 22 |
| Total No. of New patients | 2,375 |
| „ „ „ Old patients | 1,806 |
| Grand total | 4,181 |

ADMISSION REGISTER

| | |
|---|---|
| No. of Patients admitted for deliveries | 197 |
| „ „ Medical cases treated | 84 |
| „ „ Post-Natal „ „ | 4 |
| „ „ Gyneac „ „ | 21 |
| „ „ Babies admitted as Lodgers | 157 |
| Grand total | 463 |

IN-PATIENT MATERNITY REGISTER

| | |
|---|---|
| No of Normal deliveries | 148 |
| „ „ Abnormal deliveries Forceps | 9 |
| Grand Total | 157 |

Mrs. V. LAKSHMI PARVATHI
*Secretary and Convener*

Dr M. PAVANA BAI
*Medical Superintendent.*

# సింగినాదం

(నవల)

రచయిత్రి:

కె. లక్ష్మీరఘురామ్.

మూడురంగుల ముఖచిత్రం

వెల: 1-50 న. పై.

ప్రాప్తిస్థానం:

ఆంధ్ర మహిళా ప్రెస్

7-ఎ, రోజరీ చర్చి రోడ్డు, మద్రాసు 4.

Edited, Printed & Published by Mrs. K. Lakshmi Raghuram, B A., at the Andhra Mahila Press Mylapore, Madras 4. Manager and Associate Editor: Ramalakshmi Arudra.